జూలై విడుదల!

ఆడదాన్ని గౌరవించలేని సంఘం
మానవత్వం లేని రాక్షసుల నిలయం

శ్రీ ప్రొడక్షన్స్ సమర్పించు



# మరపురాని కథ

నిర్మాతలు:
సుందర్‌లాల్ నహతా, డూండీ

దర్శకత్వం:
వి. రామచంద్రరావు B.A (HONS)

మాటలు భమిడిపాటి రాధాకృష్ణ
పాటలు ఆరుద్ర, కొసరాజు,
సి.నారాయణరెడ్డి అప్పలాచార్య
కెమేరా యస్ వెంకటరత్నం
సంగీతం టి చలపతిరావు
కూర్పు యన్ యస్ ప్రకాశం
కళ యస్ కృష్ణారావు



రాజశ్రీ రిలీజ్




MOULIS

LitQuiz No. 19 — FAMINE RELIEF FUND: Rs. 1,000

Rs. 25000

FIRST PRIZE: Rs. 12,500

TRANSISTOR MINIQUIZ For Every All-Correct Winner

+ RUNNERS-UP - UPTO 4 ERRORS
MINIQUIZ:- UPTO 2 ERRORS
THESE WINNERS WILL SHARE THE BALANCE PROPORTIONATELY

Final Closing Date: 27-7-67
Solution in Bharat Jyoti: 30-7-67
Result in Bharat Jyoti: 13-8-67

*Send with your entries a self-addressed 6 Paise post card to receive Solution immediately.

*Latest issue of Litquiz Weekly will be sent Free on request.

## Official Entry Form of Litquiz No. 19

LITQUIZ No.19, ALANKAR, BALARAM ST. BOMBAY-7 (WB)

Note:—(1) Strike out with ink in each column the word you have rejected. (2) Cancel the second coupon if you send only one coupon. (3) If you send Entry fee by M O. you MUST enclose with this Entry Form the M O. Receipt you get from post office. Entries without M. O. Receipt will be disqualified. (4) Do not Cross I. P. O. Make it payable to Litquiz No. 19 at Bombay.7

| 1 | Re. 1 | | 2 | Re. 1 | |
|---|---|---|---|---|---|
| 1 | ACTIVITY | VARIETY | 1 | ACTIVITY | VARIETY |
| 2 | CHEAP | COMPLETE | 2 | CHEAP | COMPLETE |
| 3 | CONCLUSIVE | INCLUSIVE | 3 | CONCLUSIVE | INCLUSIVE |
| 4 | CULTURAL | NATIONAL | 4 | CULTURAL | NATIONAL |
| 5 | DEBT | PAST | 5 | DEBT | PAST |
| 6 | DELIGHT | DIVINE | 6 | DELIGHT | DIVINE |
| 7 | DUTY | MORALITY | 7 | DUTY | MORALITY |
| 8 | ECONOMY | STABILITY | 8 | ECONOMY | STABILITY |
| 9 | ENMITY | ENVY | 9 | ENMITY | ENVY |
| 10 | EVOLUTION | NATION | 10 | EVOLUTION | NATION |
| 11 | FAITH | LOVE | 11 | FAITH | LOVE |
| 12 | GODLINESS | GOODNESS | 12 | GODLINESS | GOODNESS |
| 13 | HAPPINESS | SELFLESSNESS | 13 | HAPPINESS | SELFLESSNESS |
| 14 | MORAL | SOCIAL | 14 | MORAL | SOCIAL |
| 15 | PERFECTION | TEMPTATION | 15 | PERFECTION | TEMPTATION |
| 16 | POET | SAINT | 16 | POET | SAINT |
| 17 | RESTLESS | SELFLESS | 17 | RESTLESS | SELFLESS |

19 SEND THESE 2 COUPONS & ENTER MiniQuiz FREE

MiniQuiz

10 CLUES FREE COUPON

| | | | |
|---|---|---|---|
| ACTIVITY | VARIETY | EVOLUTION | NATION |
| CHEAP | COMPLETE | FAITH | LOVE |
| CULTURAL | NATIONAL | MORAL | SOCIAL |
| DUTY | MORALITY | POET | SAINT |
| ECONOMY | STABILITY | RESTLESS | SELFLESS |

19 (ASVP)

In entering this Quiz I agree to abide by the Rules & Conditions and accept Competition Editor's decision as final and legally binding. Entry fee for each one coupon is Re 1. Entry fee for this complete Entry Form (of 2 coupons) is Rs. 2. I enclose M O. Receipt/I.P.O./ Litquiz Cash Receipt/Prize Card and its number is...

CAPITAL LETTERS

NAME ..........................................................

ADDRESS ......................................................

..................................................................

Cut out and send this complete Form

## 17 CLUES

1. Activity/Variety is the very soul of life. 2. Human life is not, and can never be Cheap/Complete. 3. The religious philosophy of life is Conclusive/Inclusive and universal. 4. The task in bringing about the social and economic progress which we desire for India is that of establishing Cultural/National unity in the country. 5. If you intend to move forward, it is evidently not good sense to have the burden of your Debt/Past right on your head all the time. 6 Every form of life, every beat of life is Delight/Divine. 7. Duty/Morality is not relative; it is absolute. 8. Just as brevity is the soul of wit, Economy/Stability is the soul of a State 9. Enmity/Envy is indeed the bane of social life 10. A distinctive feature of our Evolution/Nation is unity within diversity. 11. The Cross of Jesus is the classic instance of Faith/Love resisting evil and overcoming it. 12 To conquer evil and suffering one has to cultivate Godliness/Goodness 13. Desires and fears are the two enemies of true Happiness/Selflessness. 14. The dependence of man upon men has grown. This common dependence gives rise to Moral/Social relationships. 15 The problem of Perfection/Temptation is the pragmatic argument for the existence of God and man's need for Him. 16. A Poet/Saint can afford to look at the sky and the moon and stars and forget his surroundings A scientist cannot. 17. A little meditation is not good. God cannot be realized through such lukewarm moods One must yearn deeply, one must become Restless/Selfless.

NOTE: The above clues are quotations reproduced from the works of authors and writers. They are complete sentences and are also independently complete in sense. Names of Authors/Writers and their Works will be published along with the official solution in Litquiz Weekly.

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 21—7—'67
ప్లవంగనామ సం॥ ఆషాఢమాసం పూర్ణిమ
సంపుటము : 59 సంచిక : 45

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

[illegible]

| | |
|---|---|
| సంవత్సర చందా | 22.40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |

ఇతరదేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 42.00 |
| అర్ధసంవత్సర చందా | 21.00 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం : 'రంగులరాట్నం'
చిత్రకారుడు : శ్రీ కె. శేషగిరి రావు





విలియం మాంచెస్టర్

# అధ్యక్షుని మరణం

## 8

ఆ దారుణం జరిగిన కొద్దికాలంలోనే అధ్యక్షపదవికి దగ్గరగా ఉన్న వారి మధ్య చీలికలు ఏర్పడ్డాయి. కొందరు జాన్సన్ అధికారంలోకి రావటాన్ని స్వీకరించారు. కొందరు ఈ మార్పుని సహించలేక పోయారు. రెండు వర్గాలు ఏర్పడ్డాయి.

'వాస్తవిక దృక్పథం'కల వర్గంలోకి మారిన మొదటి వ్యక్తి 'ఏజెంట్' ఎమెరీ రాబర్ట్స్. తుపాకిగుండు తగలగానే అధ్యక్షుడిక బతకడని నిశ్చయించుకున్నాడు. 'రూల్స్' పుస్తకంలో 'అధ్యక్షుడి ప్రాణం కాపాడా'లని ఉంది. మరణించిన వాడి ప్రాణం కాపాడటం ఏమిటి? కొత్త అధ్యక్షుడు మాజీ ఉపాధ్యక్షుడేకదా?

ఈ నిర్ణయం ఇంత త్వరగా జరిగినప్పటికీ రాబర్ట్స్ క్లింట్‌హిల్‌ని ఆపలేక పోయాడు. కాని, హిల్ వెంట అధ్యక్షుడి కారులోకి దూకపోతున్న జాక్ రెడీని మాత్రం ఆపగలిగాడు. 'జాక్, వెళ్ళక!' అని అరిచాడు. రెడీ సందేహించి, ఆగిపోయాడు. మరొక ఏజెంటు బిర్‌మెక్ 'ఇంటయిర్‌తో 'అధ్యక్షుడిని కొట్టేశారు. నువ్వూ, బెన్నెట్ జాన్సన్‌ని కనిపెట్టాలి. ఆగగానే,' అన్నాడు.

పార్క్‌లాండ్ హాస్పిటల్ ముందు ఉపాధ్యక్షుడి కారు ఆగింది. కారులో రేడియో గట్టిగా మోగుతోంది. ఎంతో పెద్ద గందరగోళంలో వార్తలు చదివే వ్యక్తి ఊపిరి బిగబట్టి తుపాకీపేలుడు గురించి చెప్తున్నాడు.

అతనికి వార్త ఉపాధ్యక్షుడి కారు వెనకనే వచ్చే పత్రికా విలేఖరుల కారు నుంచి అందింది. మొదట కారు సరిగ్గానే వెళ్ళింది. తర్వాత ఇటూఅటూ వెళ్ళటం ప్రారంభించింది. కారులోపలి ముష్టియుద్ధం జరుగుతోంది. డ్రయివరుకి ఇది ఆటంకం...

మెర్రి మాన్‌స్మిత్ కారు రేడియో ఫోన్ తీసి—'అధ్యక్షుడు కెన్నెడీ కారుమీద మూడు గుళ్ళు పేల్చారు—' అని తన డల్లాస్‌లోని (యు. పి. ఐ.) వార్తాసంస్థకి చెప్పాడు. 12.34 కి యు. పి. ఐ. టెలిప్రింటర్ మీద ఈవార్త కొట్టేశారు. హత్య చూసినవారు తేరుకునేముందే వార్త ప్రపంచం నలుమూలలా పాకింది. చదివిందంతా, విన్నదంతా నమ్మేవారు మూడు పేలుళ్ళు అధికారయుతమయిన సంఖ్య అనుకున్నారు. వాటిని స్వయంగా విన్నవారు మొదట రెండే అనుకుని తర్వాత మూడు అని సరిదిద్దుకున్నారు.

ఆ కారులో జాక్‌బెల్ అనే మరొక విలేఖరి ఉన్నాడు. స్మిత్ అతనికి సీనియర్. తన సీనియారిటీని రుజువుచేసుకున్నాడు. అంతేకాక బెల్‌ని ఎంతసేపు ఫోన్ చెయ్యనివ్వ



వైట్‌హౌస్‌లో కెన్నెడీ చదువుకోడానికి కూర్చునే ఊగే కుర్చీ.

కుండా ఉంటే తనకి అంతమంచిదని తనే మాట్లాడుతూ ఉండిపోయాడు. బెల్‌కి వళ్ళు మండింది. తనూ మాట్లాడా లన్నాడు. స్మిత్ శుష్కవాదం పెంచుకున్నాడు. తన డల్లాస్ ఆఫీసు తన సందేశాన్ని వెనక్కి చదివి వినిపించాలన్నాడు. పైన కరెంటు తీగెలు తన సందేశాన్ని చెడగొట్టి ఉండవచ్చునన్నాడు. కారులో అందరికీ యు. పి. ఐ. ఆపరేటర్ గొంతుక వినిపిస్తోంది!

సందేశం చెడలేదని స్పష్టం అయింది. బెల్ మొహం కోపంతో ఎర్రబడింది. టెలిఫోన్ రిసీవర్ అందుకోబోయాడు. స్మిత్ దానిని తన మోకాళ్ళమధ్య దాచి ముందుసీటుకీ కారు 'డాష్‌బోర్డ్‌కీ' మధ్య దాచుకున్నాడు. బెల్ కోపంతో అతన్నీ డ్రయివర్ కిల్డఫ్‌నికూడా కొడుతున్నాడు. చివరికి స్మిత్ టెలిఫోన్‌ని బెల్‌కిచ్చాడు. అదే క్షణంలో అది పనిచెయ్యటం మానివేసింది.

ఎక్కడా ఆస్పత్రికిచెందిన మనిషిలేదు. కెల్లర్‌మాన్, పోరెల్స్, లాసన్‌లు అదిరిపోయి ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు. 'చక్రాలున్న రెండు స్ట్రెచ్చర్లు పట్టుకురండి!' అని అరిచారు రాయ్:

డల్లాస్ పోలీసువారు పార్క్‌లాండ్ హాటల్‌వారిని హెచ్చరించటానికి ప్రయత్నించారు కాని వారి 'డిస్పాచ్' పరికరం సరిగ్గా పనిచెయ్యలేదు. ఆ నవంబర్ 22 న ఎన్నో లోపాలు జరిగాయి. ఈ లోపం మాత్రం జాన్ కెన్నెడీ మరణానికి తోడ్పడలేదు. ఆయనకి తగిలిన గాయాలు అంత ప్రమాదమయినవి కాబట్టి ఈ హెచ్చరిక ఆలస్యం వల్ల మరణించాడనే ప్రసక్తే లేదు డాక్టరు బర్క్‌లీని ఊరేగింపు చివర పెట్టటంవల్ల కూడా జరిగిన ప్రమాదం ఏమీలేదు. దేశాధ్యక్షుడు మరణించి అప్పటికి ఆరునిముషాలయింది. ఈ పదివినే కనుక ఆవ్యక్తి ఆక్రమించకుండా ఉండి ఉంటే పరీక్షించిన ఏవైద్యుడయినా 'ఇతను చనిపోయాడు' అని నిస్సందేహంగా చెప్పేవాడు. కంటిపాపలు నిశ్చలంగా, విశాలమయిపోయి ఉన్నాయి. మెదడు నాశనమయింది.

నెల్లీ కాన్నలీ నిలకడ తప్పిపోయింది. కారు కదులుతున్నంతసేపూ ఫరవాలేదు కాని ఇప్పుడు ఆమెలో పెద్ద సంచలనం చెలరేగింది. వెనక సీటులో ఉన్న మనిషి చనిపోయాడు. అతని గాయాల భీభత్సం తను స్వయంగా చూసింది. ఎవరూ అటువంటి గాయాలు తగిలి బతకలేరు. కాని, వెనక సీటులో వారు ఒకటే హడావుడి చేస్తున్నారు. శవం చుట్టూ మూగి తన భర్త జాన్‌ని అశ్రద్ధ చేస్తున్నారు. ఇది సహించలేదు తను!

నిజానికి ఇది సరికాదు. అధ్యక్షుడి చుట్టూ మూగినా ఎవరూ గవర్నర్ కాన్నలీని అశ్రద్ధచెయ్యటంలేదు. చెయ్యలేరు. డేల్‌పవర్స్ కన్నీళ్లు ఆపుకుని కాన్నలీ కాళ్ళు పట్టుకుని ఎత్తాడు. ఇతరులు కూడా సాయపడ్డారు. కాన్నలీ స్పృహ కోల్పోలేదు. అతనిని ఎత్తి, తెచ్చిన రెండు స్ట్రెచ్చర్లలో ఒకదానిమీద పడుకో పెట్టారు. లోపలికి తీసుకుపోయారు. నెల్లీ తూలుతూ వారి వెంటనే వెళ్ళింది.

ఇక అధ్యక్షుడి వంతు.

శ్రీమతి కెన్నెడీ కదలలేదు. తలవంచి భర్త చెయ్యిపట్టుకునే ఉంది. వదిలితే ఆ భయంకర దృశ్యం మళ్ళీ కనిపిస్తుంది. తను దానిని భరించలేదు. చుట్టూప్రక్కల వారి వంక చూడకుండా తన ముఖాన్ని ఇంకా ఇంకా కిందికివంచి రక్తసిక్తమయిన భర్తముఖాన్ని తనవక్షానికి అదుముకున్నది. ఆమె వెక్కివెక్కి ఏడవటం అందరికీ వినిపించింది.

'మిసెస్ కెన్నెడీ!' అన్నాడు క్లింట్ హిల్ అనే ఏజంటు. ఆమె భుజంమీద ముట్టుకున్నాడు. ఆమె వణికిపోయింది. నాలుగు సెకండ్లు గడిచాయి. తర్వాత అయిదు. 'ప్లీజ్! అధ్యక్షుడిని డాక్టరు దగ్గరకి తీసుకువెళ్ళాలి!' అన్నాడు.

'నే నాయన్ని వదలను, మిస్టర్ హిల్!' అని ఏడిచింది ఆమె.

'తీసుకెళ్ళాలి మిసెస్ కెన్నెడీ!'

'కాదు మిస్టర్ హిల్. ఆయన చచ్చిపోయాడని నీకూ తెలుసు! నన్ను వదిలిపెట్టండి!'

ఆమెని బాధిస్తున్నానని గ్రహించాడు హిల్. తనకోటుతీసి ఆమె వళ్ళో ఉంచాడు. ఆమె అధ్యక్షుడి శిరస్సుని మృదువుగా దాని మడతలలో ఉంచింది. అయిదుగురు ఇతర ఏజంట్లు దేహాన్ని రెండవ స్ట్రెచ్చరు దగ్గరకి మోసుకువెళ్ళారు. వారు మరీ

(10 వ పేజీ చూడండి)

# లోకం పోకడ

— ఈస్ట్ జర్మనీ ఎన్నికలకి వెడుతున్నది

—3.7.67 పేట్రియాట్‌లో పతాక శీర్షిక

— "(పీకింగ్ రేడియో) కమ్యూనిస్టు విప్లవకారులు (నక్సల్‌బరీలో) వేలాది భూరహిత కర్షకులని కూడగట్టుకుని తమ రాజకీయ అధికారాన్ని నెలకొల్పి, కర్షక సంఘాలని సృష్టించి ఈ విధంగా 'రియాక్షనరీ' అనదగిన భారత ప్రభుత్వానికి ఎదురు తిరిగారని అన్నట్లు తెలిసింది.......

"నక్సల్‌బరీ పోరాటం ఆకలిగొన్న రయితులు భూమికోసం చేస్తున్న ప్రయత్నాల ఉద్యమం అని, సాంఘికంగా జరుగుతున్న అన్యాయాలకి ప్రతికూలంగా చేస్తున్న యుద్ధం అని మా పార్టీ ఎన్నోసార్లు చెప్పింది. పీకింగ్ రేడియో సమీక్ష మా సమీక్షకి పూర్తిగా భిన్నంగా ఉంది......." మార్క్సిస్ట్ కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా పొలిట్‌బ్యూరో ప్రకటన.

— 2.7.67 పి. టి. ఐ. వార్త.

* * *

— శ్రీ కె. డి. మాలవీయా ఇంకా కాంగ్రెసుని వదిలి శ్రీ కృష్ణమీనన్ జట్టు వెళ్ళలేదంటే కేవలం ఆయన (శ్రీ మీనన్) పార్టీ బయటపడి బాగుపడినది లేదు.

— 30.6.67 నవ్ పత్రిక

* * *

— శ్రీఫవుజీ ఈ విషయంలో ఎన్నో 'అనుమానాలు' ఉన్నాయన్నారు. చిన్న ఇస్రయిల్ భద్రతకి ప్రమాదం ఉందని అనబడుతున్నది. అయితే, గత 20 సంవత్సరాలలో భద్రతకి ప్రమాదం ఉంటే అది అరబురాజ్యాలకే, ఆ రాజ్యాల ప్రజలకే కాని ఇస్రయిల్‌కి కాదు.

— 6.7.67 పి. టి. ఐ. వార్త

* * *

— యునైటెడ్ ఆరబ్ రిపబ్లిక్ ప్రజలు, నాయకులు......... ఒక విషయం తెలుసుకున్నారు— స్నేహితుడెవరో, శత్రువెవరో, గ్రహించ గలిగారు.

— 2.7.67 లింక్ పత్రిక.

* * *

— "రష్యన్లు వేరుగా సైనికదళాల అధికారం వహించినా ఈజిప్షియన్లు వారి ఆజ్ఞలని నెరవేర్చగలరనే హామీ లేదు. ఇస్రయిలీ సైనికాధిపతి మేజర్ ఇట్జాక్ రాబిన్.

— 6.7.67 ఏ. పి. వార్త.










'మిస్టర్ బాండ్! ఈమె అసాధారణమైన స్త్రీ దివ్యదృష్టితో నాకు యదార్థాన్ని వివరిస్తుంది.'

'సాలిటైర్! ఇతను అబద్ధం చెప్పేట్లయితే నాకు చెప్పు!'

సాలిటైర్ అనే ఆ అందమైన అమ్మాయి తన మామూలు కార్యక్రమాన్ని అనుసరించింది. ఆవె కళ్లల్లో ఎదురుచూడని సానుభూతి తళుక్కు మనటం నేను పసిగట్టాను.













'ఇతన్ని గురించి నీ శక్తివల్ల తెలిసిందేమిటి సాలిటైర్? ఇతను అబద్ధాలు చెప్తున్నాడా?
'అతను నిజం చెప్తున్నాడు.'

'మీ దగ్గరున్న ఆలీటర్‌ని చితగ్గొట్టండి. బాగ హింస పెట్టండి. తర్వాత అవతల పడెయ్యండి.'
'సరే సర్!'

'నీ కళ్ళు మండా! తప్పించుకోలేవు!'
'సరే చూద్దాం. కానీ మొదట మమ్మల్ని గుర్తుంచుకోడానికి నీకు ఏదో ఒకటి యివ్వాలి.'










ఉన్నట్లుండి మిస్టర్ బిగ్ మనుషుల్లో ఒకడు నా చిటికెనవేలు విరిచేశాడు.
'నీ రాకకు ఓ చిన్న జ్ఞాపకార్థం మిస్టర్ బాండ్!'

హింసను చూడలేక సాలిటైర్ కళ్ళు మూసుకుంది.

'ఇతనికి స్పృహ తప్పింది బాస్.'
'లేపండి. ఇంకా కొన్ని విషయాలతనితో చెప్పాలి.'




'నేను నీ మీద, నీ స్నేహితుడు లీటర్ మీద ఓ గుర్తు వేశాను. ఇప్పుడు నన్నొదిలి వెళ్తావు. తెలిసిందా?'

'మళ్లీ నాకు కనిపించావంటే నా చాతైనంతగా చిత్రవధ చేసి చంపుతాను.'

'మిస్టర్ బాండ్‌ని గారేజికి తీసి కెళ్లండి. ఎది రిస్తే ఎముకలు విరిచేయండి. కాని ప్రాణం తీయ వద్దు. తర్వాత గుళ్లు తీసేసి అతని తుపాకిని అతనికి ఇచ్చేయవచ్చు.'

'అలాగే సర్, బాస్!




మిస్టర్ బిగ్ గదినుంచి నన్ను బలవంతంగా బయటికి తీసికెళ్తుండగా ఆ అమ్మాయి అక్కడ నుంచి కదల్లేదు.

'నా చెయ్యి విరగ్గొట్టేస్తున్నావ్. స్పృహ తప్పిపోయేలా వుంది.'

బయట— ఒక చిట్కా ఉపయోగించా.

మిస్టర్ బిగ్‌మనిషి నా చేతి మీద పట్టును కొంచెం సడలించాడు— అప్పుడేంచేయాలో నాకు తెలుసు.




మొదటి దెబ్బ నాది!

ఇది నాకు చాలా ఉపయోగిస్తుంది మిత్రమా. ఇప్పుడు గారేజీకి.

నేను ఎరువు తీసుకున్న ఆ తుపాకిని రెండుసార్లు పేల్చాను.........

(ఇంకా వుంది)

# అధ్యక్షుని మరణం

(7-వ పేజీ తరువాయి)

వేగంగా వెళ్ళటంచేత కోటు జారిపోతున్నదని కంగారుపడిన శ్రీమతి కెన్నెడీ ఆవేశంతో సీటుని పట్టుకుంది. మృతకళేబరం కాబట్టి ఎత్తటం తేలికకాలేదు. లాయరు వృత్తి చేస్తున్న యార్బరోకి ఆ చిహ్నాలు బాగా తెలిసిపోయాయి: 'కాళ్ళు ఎటుపడితే అటు కదుల్తున్నాయి' అనుకున్నాడు భయ విహ్వలుడయి.

అధ్యక్షుని ఆస్పత్రిలోకి తీసుకు వెళ్ళారు. లోపలి ప్రపంచమే లేదు. సూర్యరశ్మిలేదు. మందుల వాసన. గోడలరంగు ముదురు గోధుమ, నేలమీద లినోలియం ఇంకా ముదురు రంగు...

రూమ్ నెం, 2లో జాన్ కాన్నలీ మూలుగుతున్నాడు. నెల్లీ మాటలేకుండా తలుపు ద్వారం దగ్గిర నుంచుంది. ఆమె ముఖం వాచిపోయి ఉంది చూపు మరల్చింది. నెం 1 గదిలోకి అధ్యక్షుడిని తీసుకువచ్చారు. జాకీని లోపలికి వెళ్ళకుండా పట్టుకున్నారు. ఆమె జాగరణ ప్రారంభం అయింది...

ఊరేగింపులో పాల్గొన్న వారిలో ఇంచుమించు అందరికీ, జరిగినది కొద్దో గొప్పో తెలిసింది కాని, స్థానిక అధికారులకి చాలా మందికి తెలియలేదు. అందుచేతనే ఆస్పత్రిలోకి వెళ్ళపోతున్న డాక్టరు బర్క్లీని కొందరు పోలీసువారు అడ్డుపెట్టారు. ఇవిలిన్ లింకన్, పామ్‌టుర్నూర్, మేరీ గల్లాఘర్, జాక్‌వాలంటీ, లిజ్ కార్పెంటర్, మారీ ఫెహ్మర్‌లకీ ఇదేగతి పట్టింది. వాళ్ళ కెవరికీ 'పాస్'లు లేవు.

'ఈవిడే ఇవిలిన్ లింకన్, అధ్యక్షుడి కార్యదర్శి' అన్నది లిజ్ అక్కడి పోలీసు అధికారితో. అతను ఆమె 'పాస్'ని పరీక్షించాడు. అది అక్కడ పనికి వచ్చే పాస్‌కాదు. 'సారీ!' అని ఆమెని ఆపివేశాడు.

అప్పటికి కాని డాక్టరు బర్క్లీకి ఏదో ప్రమాదం జరిగిందనే అనుమానం తట్టలేదు. న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్ పత్రిక విలేఖరి డగ్ కికర్—'......కొడుకులు!' అని తిట్టుకుంటూ ఏడుస్తున్నాడు. ఇంతలో ఆండీ బెర్జర్ అనే ఏజంటు ఒక పోలీసు కారులో వెళ్ళిపోతున్నాడు. డాక్టరు బర్క్లీ అతనితో తనూ వస్తానన్నాడు. ఇది చూసిన 'న్యూస్‌వీక్' పత్రిక విలేఖరి చక్ రాబర్ట్స్ 'నన్ను కూడా రానివ్వండి!' అని వేడుకున్నాడు.

సాధారణంగా ఎంతో మర్యాదగా ఉండే డా. బర్క్లీ మాట్లాడకుండా తలుపు వేశాడు. కారు కదిలిపోయింది. డాక్టరుని పార్క్‌లాండ్ ఆస్పత్రి ముందు దించారు.

అక్కడ అంతా గందరగోళంగా ఉంది. అది మంచి ఆస్పత్రి. ఎన్నో ప్రమాదాలని అక్కడివారు తట్టుకున్నారు. కాని ఇది వారు ఊహించలేనంత పెద్దది. ప్రపంచంలో ఏ ఆస్పత్రీ ఇటువంటి దానిని తట్టుకొలేదేమో. అక్కడికి వచ్చినవారిలో చాలామంది పెద్ద పదవులలోనివారు. క్రమశిక్షణ పూర్తిగాపోయింది...

ఆస్పత్రి ముఖ్యాధికారి, జాక్ ప్రయిస్ తన సహోద్యోగులందరినీ తమ తమ వార్డులకి తిరిగి వెళ్ళిపోవలసిందిగా వేడుకున్నాడు. 'అంబులెన్సు కేసులు' కూడా కుంటుకుంటూ వచ్చిపోగసటం మొదలుపెట్టారు. నర్సులు, డాక్టర్లు వేడుకుంటున్నా పెడచెవిపెట్టారు. 'అధ్యక్షుడు మరణిస్తే మేము చూడకూడదా? శవానికి ఈ భేదాలు లేలేవు,' అన్నాడు ఒక వ్యక్తి తన నర్సుతో. ఆమె ఊరుకోకుండా, 'అధ్యక్షుడి సతీమణిని బాధించరా'దన్నది.

'జాకీ ఇక్కడుందా? ఏదీ!' అన్నాడు అతను. చివరికి అతనిని బలవంతాన ఆపారు...

'సీక్రెట్ సర్వీస్' వారు తగిన కట్టుదిట్టాలు చెయ్యవలసింది. కాని, వారిలో చాలామందికి కెన్నెడీపట్ల వ్యక్తిగతమయిన విశ్వాసం ఉండేది. అతను మరణించగానే అధికారం కుంటుపడింది. క్రమశిక్షణ నాశనమయింది...

కెల్లర్‌మాన్, హిల్‌లు కెన్నెడీదగ్గిర ఉండిపోయారు. యంగ్‌బ్లడ్, రాబర్ట్స్, ఎమ్‌జాన్స్ — వీరందరూ జాన్సన్‌దగ్గిర ఉన్నారు. ఎవరికి ఎవరంటే ఇష్టమో వాడినే అనుసరిస్తున్నారు. ఒక కార్యక్రమం, పద్ధతి అంటూలేవు. గందరగోళం ఏర్పడిపోయింది.

ఇదంతా అయినతర్వాత ఎందరో తమ నడవడిలో లోపాలని గుర్తించుకున్నారు. కాని ఆ సమయంలో సహేతుకంగా ప్రవర్తించటం కష్టం. ఎవరినీ ఏమనటానికీ వీలులేదు.

ఉదాహరణకి — మేజర్ జనరల్ టెడ్ క్లిఫ్టన్ పెద్ద ఆఫీసరు, యోధుడు, అధ్యక్షుడి ఆంతరంగిక దళంలో ఒకడు. అన్ని విషయాలూ తెలిసినవాడు. 'సిగ్నల్ కోర్'ని వాడిఉండవచ్చు. కాని, ఆ సంగతే మరిచిపోయాడు. 'వైట్ హౌస్'కి టెలిఫోన్ చేశాడు. అదృష్టవశాత్తు లైను దొరికింది. ముందు శ్రీమతులు క్లిఫ్టన్, గోడార్డ్‌లకి తమ భర్తలు సురక్షితంగా ఉన్నానని చెప్పమన్నది. ఈ ముఖ్యమయిన వార్త అందాక తర్వాత 'నేషనల్ సెక్యూరిటీ కవున్సిల్' కార్యదర్శి శ్రీ బ్రామ్లిస్మిత్ కోసం అడిగాడు. ఈ మేజర్ జనరల్ విచక్షణ అవాడు అలాగ అయిపోయింది. ముందు, ఇద్దరు ఏజెంట్ల భార్యలకి సందేశం అందచేసిన తర్వాత హత్య గురించి పెద్ద అధికారితో మాట్లాడాడు!

మరొక ఉదాహరణ —క్లింట్‌హిల్ చాలా గట్టివాడు, తెలివిగలవాడు. అయితే హఠాత్తుగా అతనికి తన కోటు శ్రీమతి కెన్నెడీకి ఇచ్చానని గుర్తుకి వచ్చింది! ఆస్పత్రి ఉద్యోగులలో ఒకతని దగ్గరికి వెళ్ళి అతని కోటు అడిగాడు. ఇటువంటి సమయంలో కోటు ఉంటే ఏమి లేకపోతే నేమి, అనుకుంటూనే అతను తన కోటు ఇచ్చేశాడు...

ఇంకా మరొకటి — డల్లాస్ పోలిస్ సర్జంట్ శావ్‌డగ్గర్ ఒక దొంగలింపబడిన కారు గురించి ఒకటే బాధ పడుతున్నాడు. ఇంతలో 'వార్త' విని పై అధికారి కారులో అక్కడికి వచ్చాడు. ముందు అనుమతి తీసు



కోకుండా వచ్చేశాడు; ఎలా? తన పై అధికారి ఏమనుకుంటాడు? తన మీద చార్జి షీటు రాస్తాడా? ఇది చాలా పెద్ద విషయం కదూ?...

నిజానికీ ఇవి పెద్ద ప్రమాదంలో ఇరుక్కుని ఈ చిన్న వివరాలని పట్టుకుని అసలు ప్రమాదం సంగతి మరిచిపోదామని అందరూ చేసే పనులే. ఇంకొక చిన్న ఉదాహరణకూడా ఇక్కడ చెప్పవచ్చు. నెల్లీ కాన్నలీ, జాకీ కెన్నెడీలు పక్క పక్కనే నుంచుని తమ భర్తల ప్రమాదాలకి సంబంధించిన వార్తలు చూస్తున్నారు. ఇద్దరికీ కెన్నెడీ నిజంగా చనిపోయాడని తెలుసు. మర్యాదప్రకారం శ్రీమతి కాన్నలీయే శ్రీమతి కెన్నెడీని ముందు ఆమె భర్త గురించి అడిగి ఉండాలి. కాని, జాన్ కెన్నెడీయే ముందు కాన్నలీ ఎలా ఉన్నాడని అతని భార్యని అడిగింది. ఆక్షణంలో నెల్లీ, 'ఈమెకీ నాకూ పరిచయం ఏమిటి?' అనుకుంటున్నది. ముభావంగా 'ఫరవాలేదు' అని ఊరుకుంది.

...హాస్పిటల్కి ఒకటే 'కాల్స్' తీసుకుంటున్నాడు. తర్వాత తనరాత తనకే అర్థం కాలేదని తెలుసుకున్నాడు! బాబ్‌బాస్కిన్ (విలేఖరి) 'డల్లాస్ న్యూస్' పత్రిక ఆఫీసుకివెళ్ళి స్నేహితులతో హత్యగురించి ఎవరేమనుకుంటున్నారో అనే విషయం గురించి మాట్లాడుతూ కూర్చున్నాడు.

లిజ్ కార్పెంటర్, మేరీ ఫెమర్‌లు ఒక గదిలో కూర్చుని ఉన్నారు. ఇద్దరికీ తాగేందుకు నీరు, తలనొప్పి మాత్రలు ఇచ్చి వెళ్ళిపోయారు అధికారులు. ఏమి జరిగిందో వారికి తెలీదు. ఇంతలో ఎవరో కెన్నెడీకి తుపాకిదెబ్బ తగిలిందన్నాడు. లిజ్ ఆలోచనలు విచిత్రంగా పనిచేశాయి: అధ్యక్షుడికి గాయం తగిలింది. అంటే, ఉపన్యాసాలు ఏవీ ఇవ్వలేడు. అతనిబదులు ఉపాధ్యక్షుడు మాట్లాడాలి. దీనికి తగిన ఏర్పాట్లుచెయ్యాలి...తను అనుకున్నదంతా మేరీతో చెప్పింది. ఇద్దరూ ఉపన్యాసకుడి "కోసం" ఒకటి ఏర్పాటు చెయ్యాలనుకున్నారు. బయటికి పరిగెత్తి అక్కడ కనిపించిన ట్రాఫిక్ కానిస్టేబుల్‌తో అంతా చెప్పారు. అతను కొంత సందేహించి అటు వెడుతున్న కారుని ఒకదానిని ఆపి అందులో ఎక్కించాడు ఇద్దరినీ. కారు శరవేగంతోవెళ్ళి ఉపన్యాసం జరగవలసిన 'మార్ట్' ముందు ఆగింది. అక్కడ గుంపు అనేది లేనేలేదు. ఉన్న కొద్ది మంది ధోరణే ఆదోక విధంగా ఉంది. ఉపాధ్యక్షుడి ఉపన్యాసం ఎవరయినా వింటారా? లిజ్‌కి సందేహం కలిగింది...

కాన్నలీని పడుకోపెట్టి బట్టలు విప్పతీస్తున్నారు. కంగారులో లోగడాని పెట్టుకు పోదుస్తున్నారు. కాన్నలీ మూలుగుతూ, 'వాటిని కత్తిరించి లాగెయ్యండి!' అన్నాడు. అని సాధారణంగా ఆస్పత్రిలో చేసేవే అని అక్కడి వారికి అప్పుడు తెలిసింది...

(ఇంకా వుంది)




'సూర్యం మాస్టారి యిల్లు యిదే నాండి?'

వీధి గుమ్మం దగ్గర ఎవరో వాకబు చేస్తున్నారు. 'అవును..., రండి, లోపలకు రండి...' ఆహ్వానిస్తూ వుంది సుభద్ర.

చదువుతున్న పుస్తకంలోని పేజీ గుర్తు పెట్టుకోడానికని అంచు మడిచి పుస్తకాన్ని మూసి, దాన్ని చేత్తో పట్టుకుని చావిడిలోకి వచ్చాడు సూర్యం.

తనకోసం వచ్చిన ఆ దంపతుల్ని చూసి క్షణకాలం స్తబ్ధుడయ్యాడు. అతని నోటి వెంట వెంటనే సమాధానం రాలేదు.

'నేనండి...రామచంద్రాన్ని; గుర్తుపట్ట లేదనా...?' అన్నాడు రామచంద్రం. ఇలా అన్నాక కూడా అతని చేతులు జోడించే వున్నాయి.

'నమస్కారమండి...' అని, తలదించు కుంది శాంత గతం ద్వారాలు తెరవబోయే మనస్సును అదుపులో పెట్టుకొని, నిలబడి వున్నవాళ్ళని కూర్చోమని అనలేదు. అలా అభినయించాడు సూర్యం.

రామచంద్రం, శాంత అవ దగ్గరకు వచ్చి కుశలమడుగుతారని కలలో కూడా అనుకోలేదు. సూర్యం ఆనందానికి అవధు ల్లేవు, ఉబ్బితబ్బిబ్బై పోతున్నాడు. అతని కళ్ళు అశ్రుపూరితాలైనాయి.

సూర్యం కళ్ళల్లో నీళ్ళు నిండడానికి కారణం శాంతా రామచంద్రాలు ఆక స్మాత్తుగా రావడంచేతకాదు. ఆ వేసకాల పొల్లంత కథ వుంది అని సూర్యానికీ, రామచంద్రానికీ, శాంతకే మాత్రమే తెలుసు. తెలియని సుభద్ర విస్మయంగా చూస్తూ వుంది.

'మీ శ్రీమతాండీ...?' శాంత సంభా షణం తిప్పుకుంటూ అని అడిగింది.

అప్పటిగ్గాని అక్కడ సుభద్ర వున్న ఆలోచనరాలేదు సూర్యానికి.

'ఆఁ... మరిచేపోయాను. పరిచయం చేయ లేదుగా. ఈమె నా శ్రీమతి. పెళ్ళయి ఎన్నాళ్ళో అవలేదులే..., సుభద్ర వీళ్ళె వరో తెలుసా...ఇతను రామచంద్రం, ఈమె శాంత. ఇద్దరూ నా ప్రియశిష్యులు. అంత కంటె చాల ఎక్కువ కాని, ఎలాగని చెప్పినా తక్కువే...'

'మా పెళ్ళికి శుభలేఖ కూడా పంపలేదు మాస్టారూ...'

పంపుదామనే అనుకున్నాను. కాని మీ అడ్రసు సరిగా నాకు తెలియలేదు.' అన్నాడు సూర్యం. శుభలేఖలు వేయించకుండా గప్ చిప్‌గా పెళ్ళిచేసుకున్నట్లు అతనికి తెలియ కూడదని.

'మీరిక్కడ ఎన్నాళ్ళి నుంచి వుంటు న్నారు. మీ అడ్రసు కూడా అంత గోప్యంగా ఎందుకుంచారు?'

అవును. గోప్యంగానే వుంచాను అను కున్నాడు సూర్యం మనసులోనే. ఆతా

అనుకున్నప్పుడు తల భారమైనందుకు వంచాడు. వంచిన తలెత్తి భార్యనుచూశాడు. ఎందుకో తొట్రుపడ్డాడు. 'సుభా...నువ్వ లానే నుంచున్నాం...? వాళ్ళని మనింటి దగ్గర కనీసం వారంరోజులైనా వుండందే కదలనిచ్చేదిలేదు...' అన్నాడు.

తమ ప్రసంగం సుభద్ర వినకూడదని, వచ్చినవాళ్ళని సత్కరించాలనే వేషం, అతని మాటల్లో కొట్టవచ్చినట్లు కనబడక పోయినా భావం అదే.

సుభద్రకి తెలిసింది సూర్యం మంచితన మొక్కటే. అందుకే హడావిడిగా లోపలికి వెళ్ళిపోయింది.

'తిరపతి వెళ్ళామండీ ... వెంకటేశ్వర స్వామిని దర్శించుకుని, మీ ఆశీస్సులుకూడా తీసుకోవాలని...' అంది శాంత. శాంత మాటల్ని పూరించాడు రామచంద్రం.

'అవునండీ వెంటనే మధ్యాహ్నం ట్రయినుకు వెళ్ళిపోవాలి. మాతోపాటు ఇంకా చాలామందివచ్చారు. వాళ్ళందర్నీ స్టేషన్లోనేవుంచి మిమ్మల్ని చూసివెళ్దామని ఇలా వచ్చాము.'

'అప్పుడే...!' అన్నాడు సూర్యం ఆశ్చర్యంగా.

'క్షమించాలి. మిమ్మల్ని చూశాక మాకూ వెళ్ళ బుద్ధికావడంలేదు. అయినా తప్పదు. మరోసారి వచ్చినప్పుడు తప్పకుండా చాలా రోజులు వుంటాం. ఈసారికి మన్నించండి,' అన్నాడు రామచంద్రం.

'మీ ఆరోగ్యం ఇప్పుడు ఎలావుంటోంది మాష్టారూ...'

శాంతకి ఎంత ఆలనో అనుకున్నాడు సూర్యం.

రెండుప్లేట్లలో చెక్కిన బంగినపల్లి మామిడిపళ్ళ ముక్కలుకోసి తీసుకొచ్చి వాళ్ళ ముందుంచింది సుభద్ర.

'మరి మీకో...అన్నాడు రామచంద్రం.'

'మేము ఎప్పుడైనా తింటాం...ముందు మీరు కానివ్వండి.'

'అలాకాదు, ఈ ప్లేటు మాయిద్దరికీ, ఇది మీ యిద్దరికీను తీసుకోండి మాష్టారూ...'రామచంద్రం పట్టుపట్టాడు.

'అవును తీసుకోవాలి... తప్పదు' అంది శాంత. చివరికి పంచుకోకతప్పలేదు.

కడుక్కున్న చేతులు తువాలుకు తుడుచుకుంటూ అన్నాడు రామచంద్రం 'మేమిక వుంటామండీ...' అని.

సూర్యం మాట్లాడ్లేదు. వాళ్ళనే చూస్తూ నిరుత్తరుడై నిలబడ్డాడు.

'వాళ్ళందరూ మాకోసం చూస్తూంటారండి. ట్రయిను టయిమయిపోవచ్చింది. టిక్కట్లన్నీ మాదగ్గరేవున్నాయి' అబద్ధ మాడినట్లు తెలియకుండా అన్నాడు రామచంద్రం.

'కాన్సిల్‌చేయకూడదూ...?' అంటూండగానే వాళ్ళిద్దరూ సూర్యం కాళ్ళకీ, సుభద్ర కాళ్ళకీ నమస్కరించి స్టేషనుకి దారితీశారు.

వెళ్తూన్న వాళ్ళిద్దరూ కనుమరుగయిపోయేటంతవరకు చూస్తూ నిలబడ్డాడు సూర్యం.

సుభద్ర అతన్ని కదిపి, తనవైపుకు తిప్పుకుంది. అతని కళ్ళల్లో నీళ్ళుచూసి బెంబేలు పడింది.

కళ్ళు తుడుచుకొని కుర్చీలో కూర్చొన్నాడు. అతనికి దగ్గరగా కుర్చీ జరుపుకుని కూర్చుంది సుభద్ర.

'ఎవరండీవాళ్ళు...?' అంది అమాయకంగా.

'నేను చెప్పలేదూ...?' అని తిరిగి ప్రశ్నించాడు.

'అదిసరే...మిమ్మల్ని అంతగా కదిలించారు గదా ... అంత సన్నిహితులెలా అయ్యారా అని...'

'ఓ...అదా..., నేను హైదరాబాదులో పనిచేస్తుండగా నాదగ్గర వీళ్ళు చదువుకున్నారు. ఇద్దరూ ఒకే క్లాసులో వుండే వాళ్ళు, చాల చురుకైనవాళ్ళు, తెలివైన వాళ్ళూను. ఇద్దరి కిద్దరే. ఒకళ్ళకుమించిన వాళ్ళొకళ్ళు. ఏడవతరగతి చదువుతున్నప్పటి నుంచీ వాళ్ళిద్దరూ స్నేహంగా వుండేవారు. ఫస్ట్‌రేంక్ పిల్లలుకూడా ... ఒకళ్ళకొకళ్ళు సహాయం చేసుకుంటూండేవారు అనుకునేవాణ్నే. ఎనిమిదికి వచ్చారు. వాళ్ళ స్నేహం మరింత ఎక్కువైంది. స్కూల్లో...బయట కలసే తిరిగేవారు. స్కూలు కంతటికీ ఒక సమస్య కింద తయారయ్యారు. నాకేం చెయ్యాలో తోచలేదు. ఇద్దరూ నాకు ప్రియమైనవాళ్ళే. ప్రోత్సహించాలో, నిరుత్సాహపరచాలో అర్థంకాలేదు. వాళ్ళు నాతో ఎక్కువగా కలివిడిగా వుండటంచేత మిగతా మాస్టర్లందరికీ గుర్రుగా వుండేది. నేనే యిదంతా చేస్తున్నానని వాళ్ళు అపోహపడి చాటుమాటున ఆడిపోసుకుంటూ వుండేవారు. ఇలా ఆ సంవత్సరము ఎలాగో గడిచిపోయింది. తొమ్మిదిలో ప్రవేశించారు. మధ్యలో యిద్దరూ పెళ్ళిచేసేసుకొన్నారు...' అన్నాడు క్లుప్తంగా సూర్యం.

సుభద్ర కిది అతిసామాన్యంగా కన్పించింది. విచిత్రమేమీ అనిపించలేదు.

'పదహారు పదిహేడు సంవత్సరాలవాడే అంతధైర్యంతో సాహసించారూ అంటే ఎవళ్ళకయినా ఆశ్చర్యంగానే వుంటుంది. అందునా వాళ్ళిద్దరూ ఒకేకులంవారుకాదు. శాంత ఉన్నతవంశములోది, రామచంద్రం నిమ్నజాతివాడునూ...'

ఇప్పుడు సుభద్ర కొంచెం ఆలోచనలో పడింది.

''మరి తల్లిదండ్రులు ఒప్పుకున్నారా?'

'రామచంద్రం తల్లిదండ్రులు ఆదిలో అంగీకరించలేదు. చివరికి ఒప్పుకోక తప్పదని అంగీకరించారు. ఒక శాంత తల్లి కొంచెం అనుకూలంగానేవున్న, తండ్రిమాత్రం కారాలు మిరియాలు నూరాడు. పెళ్ళికి శాంత తరఫువాళ్ళెవరూ పోలేదు.'

'పెళ్ళి విషారక్కడ వుండగానే జరిగిందా...? మీరూ వెళ్ళారా...?' ఇంట్లో ఏదో క్రిందపడి దొర్లిన చప్పుడయింది. 'మాయదారి పిల్లులు పాలన్నీ వలకబోసి నట్లున్నాయి' అంటూ లోపలికివెళ్ళింది సుభద్ర.

సూర్యం సిగరెట్టు తీసి వెలిగిస్తున్నప్పుడు అగ్గిపుల్లమంటలో రాజీకనిపించింది.

'రాజీ' అనుకున్నాడు సూర్యం. రాజీ అతన్ని నాలుగేళ్ళముందుకు త్రోసింది.

'రాజీ నా ప్రాణం' అనుకున్నాడు అప్పుడు. అవును, అలానే ప్రాణమిచ్చింది. తనూ యిచ్చాడు!

రాజీ తనతో కలిసి పనిచేస్తూ వుండేది. తన్ను వలచి కూడా పని చేస్తూ వుండేది.

ఆ రోజుల్లో రామచంద్రం కథ ఎంత ప్రచారమయి వుండేదో తన కథ గూడా అంత ప్రచారంగానూ వుండేది.

రాజీ ఇవన్నీ లెక్కచేసేదికాదు.

'నాకు మీరు కావాలి. మీకు నేనూ కావాలి అనుకుంటే మీరు ఇవేమీ లెక్క చేయొద్దు' అనేది.

పెళ్ళిచేసుకుందామని ఎప్పుడూ అనుకో

# చచ్చిచావని మనిషి

లేదుకాని, ఇద్దరి దృష్టి పెళ్ళివిూదే వుండేది.

తను ఆ ప్రస్తావన తెచ్చినప్పుడు రాజీ కప్పదాటు వేస్తూండేది. 'మరి, రాజీ తన నుంచి ఏమికోరుకుంటోంది?' అనుకునే వాడు కసిగా. అతనికి సమాధానం వచ్చేది కాదు. రాజీ దగ్గర నుంచి సమాధానం వచ్చేదికాదు. ఎన్నెన్నో వూహించుకుని మనస్సు పాడుచేసుకొనేవాడు. రకరకాల పుకార్లు.

స్కూలు చరిత్ర బురదలాగా వూబిలాగా తయారయింది. ఒకరోజు కమిటీవాళ్ళు అడిగారు.

'విూరు ఫలానా రోజు రిజిస్ట్రరు మారేజీ చేసుకుంటున్నారటకదా' అని. తను ఆశ్చర్యపోయాడు. రాజీని అడిగి తెలుసుకుని ఆనందించుదామనుకొన్నాడు. రాజీ కూడా ఆశ్చర్యపోయింది.

ఆ తరువాత తన ఉద్యోగానికి రిజయిను చేసింది. తనతో ఒక్కమాట కూడా చెప్ప లేదు. రాజీనామా ఎవరితోనో పంపించింది. తనురాలేదు. మర్నాడు స్కూలుకు రాకపోతే ఎవరినో అడిగి తెలుసుకున్నాడు. రాజీ రాజీనామా యిచ్చిందన్నప్పుడు తను భూమిలో దిగిపోయాడు. ఊపిరి సలపలేదు. పైనుంచి లావా ప్రవహించింది...కాని చావలేదు చచ్చే యాతనను అనుభవించాడు.

రాజీని కలుసుకుందామని ఎన్నో ప్రయత్నాలు చేసాడు. అన్నీ విఫలమైనాయి.

ఒకరోజు తెలిసింది. రాజీ పెళ్లికొడు కుల్ని చూడటానికి తిరుగుతోంది, వాళ్ళ నాన్న తిప్పుతున్నాడు, అని.

చచ్చిపోదామనుకున్నాడు తను.

రాజీని చూసి మరీ చచ్చిపోదామను కున్నాడు. ఒకరోజు రాజీ బజార్లో కని పించినట్టే కనిపించి మాయమైపోయింది.

తను కృతనిశ్చయం చేసుకున్న రోజు అన్ని ఏర్పాట్లుచేసుకుని చివరిసారిగా రాజీ యింటికి వెళ్ళాడు.

రాజీ కనిపించలేదు.

అదేసమయంలో రాజీ తన యింటికి వచ్చి తనకోసం వేచివున్నట్టు తెలియదు. రాజీవచ్చి వెళ్ళాక యింటికి చేరుకున్నాడు తను. రాజీవచ్చి వెళ్లినట్టు తెలిసి మళ్ళీ పరుగెట్టాడు. రాజీ రైల్లో ఢిల్లీ వెళ్ళి పోయింది.

భోరుమని ఏడ్చాడు.

ఇష్టదైవాన్ని ప్రార్థించుకొని యిన్ని స్లీపింగ్ టాబ్లెట్లు నోట్లోపోసుకున్నాడు.

కాని చచ్చిపోలేదు. హాస్పిటల్లో కళ్ళు తెరిచాడు. పళ్ళెరిగి కళ్ళు తెరచినరోజు రామచంద్రం పెళ్లికొడుకుగా పసుపు

( 54వ పేజీ చూడండి)

## కొత్తరకం వస్త్రం

నలగకుండా, లాగకుండావుండే ఒక సరి కొత్త వస్త్రాన్ని కాలికోమిల్సువారు తయారు చేశారు.

దానిపేరు 'కాలి-సింత్'. పట్టుకుంటే టెరిలిన్ మాదిరిగా వుంటుంది. చూడ్డానికి పీసలైన సిల్కులాగా వుంటుంది. నూలు కూడా కాదు! ఇంటిదగ్గరే వుతుక్కోవచ్చు. తొందరగా ఆరిపోతుంది. 'విడిపోవడమంటూ వుండదు.

రంగులు, ప్రింటెడ్ చీరల్లోను; తెలుపు, రంగు పాప్లిన్స్‌లోను, తదితర రూపాల్లోను లభిస్తుంది. 'కాలి-కట్' చీరలు, 'కాలి-ఎస్టర్' వస్త్రాలు, 'కాలి—థెర్మ్' దుప్పట్లు 'కాలిక్లాత్' కాలికోమిల్సు వారి ప్రత్యేక తయారీలు.

ఇటీవల నగరంలో ఏర్పాటుచేసిన 'ప్రదర్శన'లో కాలికోమిల్సు జనరల్ మేనేజరు శ్రీ బి.వి.భట్ ఈ విషయాన్ని విశదంచేశారు.

### భరతనాట్య అరంగేట్రం

శ్రీ చంద్రశేఖర్ శిష్యురాలు, యు. ఎస్. ఐ. ఎస్. పత్రికా విభాగ ప్రధాన అధికారి శ్రీ డి. రాధాకృష్ణ కుమార్తె కుమారి ఉష భరతనాట్య అరంగేట్రం ఇటీవల స్థానిక మ్యూజియం థియేటలో యు. ఎస్. ఐ. ఎస్. సమాచార శాఖాధికారి శ్రీ ఎడ్డీ డియర్ ఫీల్డ్ అధ్యక్షతన జరిగింది.



కుమారి ఉష

ఆనాటి కార్యక్రమంలో కుమారి ఉష స్తోత్రం, అలరిప్పు, జతిస్వరం, శబ్దం, నటనమాడినార్, వర్ణం, తాయే యశోద, తిల్లాన, లాస్యం, కురతి మొదలైన అంశాలను ప్రదర్శించింది.చి. ఉష ప్రదర్శననుపలువురు ప్రముఖులు మెచ్చుకున్నారు.—(ఒ.వి.)

'కాలిసింత్'లో మరింత ఆకర్షణీయంగా కన్పించే సుందరి



సీరియల్

## తాడిగిరి పోతరాజు

### జరిగిన కథ

వెంకట్రామయ్యగారు ఓ హైస్కూలు సంస్థాపకులు. ఆయన కుమారుడు మధు. వారింట్లో పెరిగిన అనాథ ప్రసాద్. ఆ స్కూల్లో పనిచేసే హెడ్మాస్టరు కామయ్య ఆయనకు ఆప్తమిత్రులు. వెంకట్రామయ్యగారికి జబ్బుచేసి మరణిస్తారు. మధు, కామయ్యమాస్టారి కూతురు శారదను ప్రేమిస్తాడు. శారద అంగీకరించదు. ప్రసాద్‌మీద శారదకు ఎంతో అభిమానం. తప్పించుకు తిరుగుతుంటాడు ప్రసాద్. తర్వాత అతనంటే ఆమెకు అశాంతి ఎక్కువయింది. స్కూలు హైస్కూలు కావడంతో కామయ్య మాస్టారు పదవీ విరమణ చేయాల్సివచ్చింది. కొత్త హెడ్మాస్టరు ఛార్జి తీసుకుంటూ స్కూలు సొమ్ము రెండువేల రూపాయలు లెక్కతేలనట్టు తెలియపరుస్తాడు. చార్జి ఒప్పగించేసమయంలో రెండువేలు తేడా రావటాన్ని ఆసరాగా తీసుకుని కామయ్య మేష్టార్ని అల్లరి పెడ్తామన్న కొత్త హెడ్మాస్టర్‌గారికి కార్యదర్శి శివరామయ్య మాటలు భరోసామాటలు నిరాశ కలిగిస్తాయి.

## 15

స్కూలుప్రాంగణంలో అడుగుబెట్టాడు.

రంగురంగుల పువ్వులు — అందంగా, అమాయకంగా ఉండి మనస్సుకు ఆహ్లాదం కలిగిస్తున్నాయి. ఒక్కొక్క పువ్వునే స్పృశిస్తూ పూలతోటంతా కలియతిరిగాడు. ఎవరికి నివేదించుకోవాలో తెలియని అంతర్వేదన ఇట్టే మాయమైపోయింది. ఆ చివరివరకూ నడిచి వెనకవైపు వరండానుండి హెడ్మాస్టరు గదికేసి నడిచాడు, సంతకంపెడ్దామని.

ఆ కిటికీ తలుపువద్ద ఆగిపొయ్యారు తన పేరు విని,

తనను గూర్చి మాట్లాడుతూన్న కంఠాలను పోల్చుకొన్నాడు.

'ఇంకొక విషయం. నిన్న పిల్లలు ఏదో ఆటల పోటీకి వెళ్ళాలని అయిదు వంద లడిగారు. నేను రెండు వందలే యిస్తానని ఖచ్చితంగా చెప్పేశాను. ఇప్పుడున్నవి కదాని మొత్తం ఒక్కసారే ఖర్చుపెట్టుకొంటారా? ... అయినా వెధవ ఆటలు కూటికా— గుడ్డకా ?... కాళ్ళూ చేతులూ విరగ్గొట్టుకోటానికి కాకపోతే ... నేనేమనుకొన్నానంటే అందులో కొంత— అందులో కొంత మిగిల్చి ఏదో మ్యాగజైను అచ్చువేయించితే మీదీ — వెంకట్రామయ్యగారిదీ ఫోటోలు వెయ్యవచ్చు... అది శాశ్వతంగా ఉండిపోతుందని నా ఉద్దేశం... అయితే ఏం జరిగిందంటే... వాళ్ళు వెళ్ళి కామయ్యగారితో చెప్పుకొన్నట్టున్నారు— ఆయన వచ్చి అయిదు వందలిచ్చివెయ్యండి... ప్రతి ఏడాదీ పంపిస్తున్నా'మని వకాల్తా...పైగా వాళ్ళసమక్షంలో నేను మీమీద చెప్పాను...శివరామయ్యగారికేం తెలుసన్నాడు పుటుక్కున... ఇదీ పరిస్థితి... ఇంతకూ నేను మీ మాట వినాల్నా... వారి మాట వినాల్నా... అది తేల్చి చెప్పండి... నేసలే 'స్ట్రిక్ట్'మనిషిని...... కావాలంటే హెడ్మాష్టరుగా ఆయన్నే ఉండమనండి...' ఆవేశంతో పొంగిపోయింది ఆ కంఠం.

'శివరామయ్యకేం తెలుసన్నాడా ?... నిజంగా ?'

'అన్నాడా ?... అంటే నా మాట మీద నమ్మకం లేదన్నమాట... సరే మీతోచెప్పటం నాదే పొరపాటు... మీకు ఆయనమీద అంత అభిమానమున్నప్పుడు...'

రెండవ కంఠం వెంటనే సమాధానమివ్వలేదు. ఆవహించిన నిశబ్దతలో గోడ గడియారం 'టిక్కు' 'టిక్కు' మంటూ కాలాన్ని తన్నుకొంటూ ముందుకువెళ్ళటమే వినిపించసాగింది.

'అదిగాదు...నేననేది' సంశయాత్మకంగా ఆగిపోయింది రెండవ కంఠం.

'పంతులుగారు అలాతూలి మాటజారే రకంకాదు... మేం ఇన్నేళ్ళనుంచి చూస్తున్నాం...అలా ఎందుకన్నట్టు'...

'ఆయనమీద చెప్పాల్సిన అవసరం నాకేమిటి?...నాకేమైనా పగా—చెప్పండి— ఇదిగో శివరామయ్యగారూ మీావిషయం నాకు తెలుసు—మీఁరొక్కరేమిటి?... ఊళ్లో అందరూ ఆయనంటే నెత్తినెట్టుకొని పూజిస్తారు...ఆయన విజాయితీపరుడే...నేను కాదనను...కానీ స్కూలు విషయాల్లో జోక్యం కలుగజేసికొంటే...నేను ఎన్నాళ్ళని సహించి ఊరుకోవాలో నా కర్థం కావటంలేదు. పోయినవారం...వాడు భాస్కర్...అదే కోటయ్యగా రబ్బాయి—'నాగార్జుననాగర్' ఎక్స్‌కర్షన్ తీసికెళ్లటానికి కామయ్యగారొస్తేనే పోతాం—లేకపోతే లేదని కూర్చున్నాడు...' మొదటిగొంతు ఆగిపోయింది.

'అందులో కామయ్యగారి తప్పేమిటి?'

'వాడికా విధంగా నూరిపోసి నా మీదకు ఉసికొల్పాడు—అదీ' మాష్టారు అచేతనంగా నిలబడి వినసాగాడు! ఆ మాటతో రక్తం పొంగినరాలు ప్రకోపించాయి. ముందుకు కదలబొయ్యాడు, అక్కడ ఆవహించిన స్తబ్ధత గచ్చుపై ఆయన చెప్పు జారటాన్ని గమనించి కొద్దిగా చలించింది.

'ఇటెవరో వచ్చినట్టుంది...ఎవరో చూడ్రా సరవాయ్!' అన్నది హెడ్మాష్టరు గొంతు.

మాష్టారు వెంటనే వరండాదిగి పూలతోటలోకి వెళ్ళిపొయ్యారు. ఆయన మనసు వికలమైపోయింది. శరీరమంతా చెమటలు పోయసాగాయి. ముఖం తుడుచుకొన్నాడు. పిడికిలి బిగించుకొన్నాడు.

'వెళ్ళి శివరామయ్య ఎదుటనే విషయాలు ముఖాముఖి తేల్చుకొందాం—వెధవ ... ఈ నాటకాలన్నీ ఎందుకాడుతున్నాడో...దానివలన అతని కొరిగేదేమిటో' అంటూ ముఖద్వారంవైపు

మెన్స్లీక్కి ఆఫీసుకేసి పెద్ద పెద్ద అంగ లేశాడు.

ప్యూన్ సరవయ్య ఎదురై నమస్కరించాడు,

'నిన్న సాయంత్రం వచ్చింది. రాత్రి పొద్దుపోయిందాక ఇక్కడే పని తెమలక ఇంటికి తేలే'దంటూ ఒక ఇన్‌లాండ్ కవరు చేతిలో పెట్టాడు—'ఎంత నిర్లక్ష్యం—నిన్న వచ్చిన ఉత్తరం ఇవాళిస్తున్నాడు...లోగడ ఎప్పుడైనా ఇలా చేశాడా వీడు—కానియ్యి' ...స్వగతంగా తిట్టుకొంటూ ఎవరి దగ్గర నుండి వచ్చిందోనని ఆత్రతతో వెనకవైపు చూశాడు. ఆ ముఖంలో కోపం ఎగిరిపోయి దరహాసం పొడసూపింది.

అక్కడే నిలబడి గబగబా విప్పి చదువుకో సాగాడు.

ప్రియమైన నాన్నకు.

నమస్కరించి వ్రాయునది: మీరు వ్రాసిన ఉత్తరం అందింది. ఎం.ఓ. కూడ ముట్టినది. వెంటనే జవాబివ్వలేకపోయినందుకు మన్నించండి.

మీరు వ్రాసిన ఉత్తరంలో ఏవేవో విషయాలు వ్రాశారు—నా గూర్చి. 'నావద్ద డబ్బులేదని నీవు ఇబ్బందిపడకమ్మా—ఎప్పుడవసరమైతే అప్పుడు వ్రాయి' అంటూ ఏమిటో వ్రాశారు—అంతా నా గూర్చే.

ఉత్తరం ఎన్నిసార్లు చదివినా అక్కడి పరిస్థితులను గూర్చి ఒక్క మాట కూడా లేదు ఎందుకు నాన్నా? — అవి తెలిస్తే నేను దిగులుపడిపోతాననుకొన్నారు కదూ ? మీరు నానుండి విషయాలు దాచినంతమాత్రాన నేను తెలుసుకోలేనా నాన్నా?

మీరు జీవితమంతా ఆ స్కూలుకొరకు వెచ్చించారు. అప్పుడు మీరు ప్రధానోపాధ్యాయులు. ఇప్పుడు మామూలు ఉపాధ్యాయులు. అప్పటిలో మీకు వెంకట్రామయ్యగారు పెద్ద అలంబనగా ఉండేవారు. వారు బ్రతికి ఉన్నప్పుడు మీ ఆశయాలకూ, ఆదర్శాలకూ ఒక రూపం కనిపించింది. ఇప్పుడు వారు లేరు. మిమ్మలను అర్థంచేసికొని మీతో సహకరించే వాళ్లు ఎవరూ లేరు. మీరు స్కూలువిషయంలో ఆ కొత్త హెడ్మాష్టరుగారికి సలహా లివ్వటంగానీ— ఘర్షణపడటంకానీ చెయ్యవద్దు.

మిమ్మలను ఆయన లెక్కచెయ్యడంలేదని మీరు భావించకూడదు నాన్నా! జీవితంలో మనకు ఇష్టంలేని మార్పులు వచ్చినప్పుడు వాటిని ఓరిమితో భరించి, కొత్త అనుభవాలను జీర్ణించుకొని కొత్త మార్పులకు అనుగుణ్యంగా జీవితాన్ని సరిపెట్టుకోవాలని నేను మీకు చెప్పాలా— నాన్నా!

మీకు ప్రధానోపాధ్యాయులుగా ఉండాలనే



కోరికగా ఉంటే... నా చదువయిపోయ్యాక మీరు బి.యిడ్. చేద్దురుగాని...సరేనా?

భామాకి వచ్చే సంవత్సరం 'ఆప్షనల్ మాథ్స్' ఇప్పించుదాం— లెక్కలు బాగా చేస్తూ౦డమని చెప్పండి.

'ప్రాక్టికల్స్'కి వెళ్లాలి వాన్నా...'టైం' అయిపోయింది వచ్చే వారంతో అయిపో తాయి. సోమవారం ఇంటికొస్తాను. ప్రసాద్ ముందే వస్తాడు. శెలవు.

మీ
శారద.

ఉత్తరం రెండు మూడుసార్లు చదువు కొన్నాడు. ముంచెత్తిన ఆనందపు వెల్లువలో ఆ మెట్లెక్కిన ఉద్దేశ్యం మరుగున పడిపో యింది. 'బంగారు తల్లి... దాని చదువయి పోయ్యాక నన్ను బి.ఇడ్. చెప్పిస్తుందట... అప్పుడు నేను మళ్ళీ హెడ్మాష్టరునై పోతాను...' తనలో తాను గొణుక్కుంటూ, గడ్డం గీరుకొంటూ మెట్లు దిగి ఉత్త రాన్ని జాగ్రత్తగా మడిచి జేబులో పెట్టు కొన్నాడు. చుట్టూరా కలయజూశాడు.

పిల్లలెవరూ రాక అంతా నిర్మానుష్యంగా వుంది

ముంజేతిపై లాల్చీ తొలగించుకున్నాడు. మొదటి ప్రపంచ సంగ్రామం ముందు నాటి గడియారం. డయల్ మాసి అంకెలు చెరగి పొయ్యి మసక మసకగా ఉంది. చెవివద్ద పెట్టుకొని దాన్ని సజీవత్వాన్ని నిర్ధారణ చేసికొన్నాడు.

ప్యూన్‌కేసి తిరిగి "... ఇంకా సెకండ్ బెల్ కొట్టలేదే..." ఇదివరకటి హొందా తనమే ప్రతిధ్వనించింది ఆ ఆజ్ఞాపించ డంలో.

'ఈవేళ ఆదివారంకదండీ...' అన్నాడు ప్యూన్.

'ఓహో...ఆదివారమా'అని కొద్దిగా ఆలోచించి' మరి ఫస్ట్‌బెల్ ఎందుకు కొట్టావ్?' అన్నాడు.

'అబ్బే...నేను కొట్టలేదండీ...పిల్లలు కూడ ఎవరూ ఇటు కల్లిరాలేదు. నవ్వుతా లకు కొట్టారనుకోటానికి...'

కాళ్ళీడ్చుకొంటూ తిరిగి గృహోన్ముఖు డయ్యాడు.

*     *     *

వేసవి శెలవు లొచ్చాయి.

పగలు బయటికి రావటానికీ వీల్లేని గాలులు—రాత్రిళ్ళు పన్నెండయితేనే గానీ వడ గాలి తగ్గుముఖం పట్టటం లేదు—

ఆవేళ శారద పడకొండుగంటలకల్లా భోజనం ముగించుకొంది. 'టీపాయ్' మీద కాళ్ళు పెట్టుకొని, వాలుకుర్చీలో పడుకొని విసురుకొంటూ నవల చదువుకోసాగింది ఇంట్లో తను మినహా ఎవరూలేరు. భామా ఎటో ఆడుకోను పోయింది—తన తండ్రి ప్రసాద్‌ని వెంటపెట్టుకొని గుంటూరు వెళ్ళాడు. అంతా నిశ్శబ్దంగా ఉంది.

లేచి తలుపువారగా వేసికొని నవల చద వటంలో నిమగ్నురాలయి పోయింది.

'ప్రసాద్...ప్రసాద్'...బయట నుండి కేక వినిపించింది.

'ఎవరూ?'.. తలుపు కొద్దిగా తొలగించి చూసింది.

'ప్రసాద్...లేడాండీ'... వీధిలో నిలబడి 'మధు' పిలుస్తున్నాడు — నిప్పులు చెరగి పోస్తూన్న ఎండలో వెన్నటోల్ల నిలబడినట్లు నిశ్చింతగా నిలబడ్డాడు.

ప్రసాద్ లేడు... గుంటూరు వెళ్ళాడు... లోపలికి రండి'

'ఫర్వాలేదులెండి... ప్రసాద్ వచ్చాక నా వద్దకు రమ్మని చెప్పండి' అంటూ గిర్రున వెనక్కి తిరిగి వెళ్ళిపొయ్యాడు—వెళ్తూన్న ఆతనికేసి ఓ నిముషంపాటు నిర్నిమేష దృక్కు లతో చూసింది. నవల మూసి బల్లపై పెట్టింది.

చెంపకు చేతిని ఆన్చి ఆతనిని గూర్చి తలపోయ సాగింది.

ఆతను శెలవులు గడపటానికొచ్చినట్లు ఊళ్లో అందరికీ తెలియదు. అందంగా నవ్వుతూ ఆనందంగా తిరిగే తను నల్ల బూసయిపొయ్యాడు. అంత విపరీతమైన మార్పు అతనిలో కనిపిస్తోంది.

ఇదివరకు రంగురంగు బట్టలువేసి కోవటం - నడుం క్రిందకు జారిపొయ్యేలా 'ఇన్‌షర్ట్' చేసికోవటం — వెంట్రుకలు నొసటిపై పడేలా తలదువ్వుకోవటం అన్నీ మంత్రించినట్లు మాయమయ్యాయి. కెమేరా ఆతని భుజంపై వేలాడటం అసలే మాను కొంది. ఊళ్లో ఆడామొగా ముక్కుమీద వేలేసుకొనేలా ముస్తాబు చేసికొనే ఆ బస్తీ బాబులో కొట్టొచ్చినట్లు కనిపిస్తూన్న ఈ మార్పులు శారదకు ఆశ్చర్యమనిపించింది.

ప్రసాద్‌లా తెల్లని పైజమా లాల్చీవేసి కొని అతిసాధారణంగా తిరుగుతున్నాడు, మధ్య మధ్యలో ధోవతి ధరించి పదిమంది పెద్దలతో సమావేశాలకు హాజరవుతున్నాడని — చిన్నా పెద్దా తారతమ్యం గుర్తించి మసలుకొంటు, న్నాడని తాను ప్రసాద్ నోటిద్వారా విన్నది. ఊళ్లో తానొక విశిష్ట వ్యక్తిననీ తనకు కొన్ని ప్రత్యేకతలున్నాయనే భావం పూర్తిగా నమసి పోయినట్లు కనిపించింది.

తన తండ్రి వీధిలో కనిపించినప్పుడు విన యంగా చేతులుకట్టుకొని మాట్లాడుతూ ఇంటి వరకూ దిగ విడిచి వెళ్తున్నాడు. అప్పుడప్పుడు — కూచోమని బలవంతం చేసినా వినిపించుకోకుండా వెంటనే వెళ్ళి పోతున్నాడు—ఈవాళ్టిలా—

ఎంత మారిపొయ్యాడూ?...తాననుకొంది.

తనకు రెండుమూడుసార్లు ఊర్మిళ వాళ్ల వీధిలో ఎదురుపడ్డాడు. ముందు తనే 'సుప్రభాతం' - అంటూ వినయ విధేయతలు కల్గిన ఆదర్శ విద్యార్థిలా నమస్కరించాడు. రెండుమూడు మాటల కన్న విస్తరించి మాట్లాడలేదు—తనదారిన తను తలవంచుకొని వెళ్లిపొయ్యాడు.

'పాపం'—'మధు'— తన హృదయం ప్రేమపూర్వక వాత్సల్యంతో పొంగిపోయింది.

'పాడు ఆలోచనల'ని తల ఎగురవేసి కొంది. మళ్ళీ పుస్తకం ముందు పెట్టుకొని ఎంతో పట్టుదలతో చదువసాగింది. కానీ మనస్సువశం తప్పిపోసాగింది. అనంతమాధు ర్యానుభూతి ఏదో తన హృదయాన్ని స్పృశించసాగింది.

అంతలోనే ఏదో నిశ్చయానికొచ్చినట్లు చివాలున లేచింది. తలుపులు దగ్గరిగాలాగి వసారాలో నిలబడి 'భానూ' అంటూ ఎదు రింటికేసి చూస్తూ కేకపెట్టింది.

'నేను ఊర్మిళ వాళ్ళింటికి వెళ్తున్నా... ఇక్కడికొచ్చి ఆడుకోండి' అంటూ పెద్దగా మాట్లాడి చీర సర్దుకొంటూ బయటికి నడిచింది. సరాసరి ఊర్మిళ వాళ్లింటి కెళ్ళింది. అక్కడ ఊర్మిళలేదు. తిన్నగా 'మధు' వాళ్ళింటికి దారితీసింది ఏమాత్రం వెనుకాముందూ చెయ్యకుండ.

గేటుతీసి చూసింది.

మధ్యహోలులో అచ్చమ్మగారు మ్యాటులు వేసి




అప్పుడాలోచించాను... నిజానికి అది పూర్తిగా నా భార్య తప్పు కాదేమో. నా తప్పు అయివుండ వచ్చుకూడా... అస్తమానమూ ఎంతో అలసటగా డస్సిపోయి వుండే వాణ్ణి.

డాక్టరు సలహా ఎంతో సహాయపడింది. "హార్లిక్స్ తీసుకోండి. అదనపు శక్తి పొందడానికి అది మీకు సహాయపడుతుంది" అని అన్నాడాయన.



నేనిప్పుడు నిజంగానే ఒక మారిన మనిషిని. హార్లిక్స్ నాలో యెంత చక్కని మార్పు కలిగించిందో ప్రతిఒక్కరూ గుర్తిస్తున్నారు.

# ఎంతో ఆనందం... హార్లిక్స్ వాడిన తరవాత!



అలసట మీకెక్కడున్నా ఇబ్బంది కలిగిస్తుంది. మీరు ఎక్కువ శక్తి కలిగివుంటే ఎంతో ఆనందంగా వుంటారు. అధిక శక్తికోసం డాక్టర్లు హార్లిక్స్ సిఫార్సు చేస్తారు! హార్లిక్స్ వినియోగమయిన శక్తిని తిరిగి ఇచ్చి ఉత్సాహాన్ని ఇస్తుంది. త్వరగా సులువుగా జీర్ణమయ్యే సహజ ఆహార పదార్థాలతో ఒక ప్రత్యేక పద్ధతిలో హార్లిక్స్ తయారు చెయ్యబడింది. హార్లిక్స్ మీకు క్రొత్త జీవితం ప్రసాదిస్తుంది!




గోధుమ పిండి మరియు మాల్టెడ్ బార్లీల పోషకవంతమైన సారములు మరియు పూర్తి మీగడ గల పాలతో చేయబడినది

## హార్లిక్స్

అదనపు శక్తిని కలిగించును!

కొని కూర్చుంది. నట్టింట్లో పెద్దబస్తా కుమ్మరించి పనిమనుషులు చాళ్ళుచేస్తున్నారు. ఆమె నొసటికి చెయ్యి అడ్డం పెట్టుకొని వస్తూన్న శారదకేసి చూస్తూ.

'ఎవరూ...ఊర్మిళా...మళ్ళీ వస్తున్నావేం?...నీవా శారదా...రా...రాతల్లీ...ఆయన పోయ్యారు ... మా ఇంటికే రావటం మానుకొన్నారు. చిన్నదికూడ ఇటు తొంగిచూడటం లేదు...ఈసారి వచ్చినప్పుడు దాని చెవులు పట్టుకొని తీసుకురామ్మా...ఏదైనా పెడితే ముంగిలా తిని మూతి ముడుచుకొనిపోతుంది'.. శారదపట్ల ఆమె అంతరంగిక భావాలెలా ఉన్నా పైకిమాత్రం తొణక్కుండ తియ్యగా మాట్లాడింది. ప్రేమపూర్వకంగా వీపు నిమిరి ఎగాదిగా చూసింది.

ప్రసన్నత తొంగిచూస్తూన్న ముఖం. తీర్చిదిద్దినట్లున్న ఆ రూపురేఖలూ— యవ్వనపు ఛాయలూ — ఎండలో నడిచి వచ్చినా వన్నెతగ్గని బంగారు ఛాయా— చూసి లోలోన ముచ్చటపడింది.

'ఏమ్మా...ఎండలో వచ్చావ్.'

'ఊర్మిళకోసమని... ఇంటికివెళ్తేలేదు... ఇక్కడికొచ్చిందేమోనని'...

'వచ్చి ఇప్పుడేపోయింది ... నీకు ఎదురు కాలేదా?...నీవెటొచ్చావ్?...'

'ఇటేవచ్చా... నా కెదురుపడలేదే' అంటూ బజారుకేసి చూపెట్టింది. పద్మ చేస్తూండటంవలన దుమ్ములేచి కోరుపుట్టి

# మట్టి బొమ్మలు

శారదకు దగ్గొచ్చింది.

'నే వెళ్తానండీ' అంది తలమీద దుమ్ము పడకుండ ముసుగేసికొంటూ.

'ఏమిటే ఈ ఎండలో మళ్ళీ కాళ్ళు కాళ్ళా కొట్టుకొంటూ ఆవీధి కెళ్తావా? చావటానికా? బ్రతకటానికా? ... పాడు ఎండ ... కాకులు వయిటం నోళ్ళు తెరుస్తూంటే ... ఉండు ఎండతగ్గాక వెళ్ళువు గానిలే ... అబ్బాయున్నాడుగా మాట్లాడు కోటానికి ... ఒరేయ్ అబ్బాయ్...ఇదుగో— శారద వచ్చిందిరా... ఇదుగో ఆ చాలు మళ్ళీ వీటిలో కలుస్తున్నాయ్...' అంటూ పని వాళ్ళను కూడ హెచ్చరించింది.

'పడుకొన్నట్లుంది—లేపకండి...నే వెళ్తాను...ఊర్మిళతో నాకు అర్జెంట్ పని ఉంద'ని, చెబుతూనే ఉంది...

'ఎవరూ?' అంటూ వెనకగదిలోనుండి చదువుతున్న పుస్తకాన్ని అలానే పట్టుకొని తలవంచుకొని ఈవలికొచ్చాడు. ఏదో పెద్ద పబ్లిక్ పరీక్షలకు వెళ్తున్నవాడిలా అలా దీక్షగా చదవటం చూసి శారద లోలోన నవ్వుకుంది. పైజమా బనియనూ వేసి కొన్నాడు. శారదను చూసి తన కళ్ళను తానే నమ్మలేనట్లు ఒక్షణకాలం స్తంభించి పొయ్యాడు. ఆనందంతో కళ్ళు రెపరెప లాడాయి.

'మీరా?'...చిరునవ్వుతో పలికాడు.

'పైకి వెళ్దాం...ఇక్కడకోరు...పైన గాలి కూడ సరిగారాదు' అంటూ దొడ్డివైపు మెట్లమీదనుండి పైకి దారితీశాడు. శారద చీర కుచ్చిళ్లను సుతారంగా ఎత్తిపట్టుకొని సిగ్గుపడుతూ అతనిని అనుసరించింది— 'పైకివద్దులే' అని చెప్పలేని తన బలహీనతకు నిందించుకొంటూ.

మూడువైపులా కిటికీలున్న గది—గాలి స్వేచ్ఛగా నిరాటంకంగా అక్కడ తిరుగుతోంది. వాకిలిప్రక్కనున్న కిటికీకి సన్నజాజుల తీగె అల్లుకుంది. ఆ కిటికీ ముందు ఆ తీగె పందిరిలా ఉంది. కిటికీ లకు నీలిరంగు పిల్కుపరదాలు. 'రూమ్' అంతా కలయజూసింది.

ఆ గదిలో కూడ ఎన్నో మార్పులు జరిగినట్లు తాను వెంటనే గ్రహించింది. లోగడ 'టేబిల్'పై పడిఉండే 'ట్రా'లూ 'జా'లూ—పౌడర్లూ—దువ్వెనలూ అన్నీ అదృశ్యమయిపొయ్యాయి. వాటి స్థానే విశ్వ సాహిత్యంలో విలువైన కావ్యాలూ, నవలలూ' అన్నీ దొంతర్లు దొంతర్లుగా ఉన్నాయ్. అందమైన 'పేం' కుర్చీలతో నగిషీవస్తువులతో చిత్రపటాలతో ఆకర్షణీయంగా ఉంది. ఆ ఏర్పాట్లలో ఆడంబరమూ అట్టహాసమూ కనిపించటంలేదు. మనసుకు ఆహ్లాదకరంగా ఉన్నాయి—వీక్షణంలో అన్నీ పరిశీలించింది.

'కూర్చోండి...ఎండలో వచ్చారు...నిమ్మ రసం త్రాగుతారా?' ఏదో అతిథిమర్యాదలు చెయ్యాలని అతను తహతహ లాడటం. తన సన్నిధిలో హైరానాపడటం—తన నొక అసాధారణ 'స్త్రీ'గా భావించి—తన రాకతో పరవశం చెంది ఉక్కిరిబిక్కి రయిపోవటం చూసి నవ్వుకొంది లోలోన. అతనిని ఏడిపించ బుద్ధిపుట్టింది.

'అవసరంలేదులేగానీ'...అంటూమరొక్కసారి గదినంతా కలయజూసి—'ఊఁ...చాలా మార్పులు కనిపిస్తున్నాయి...దీనికి కారణ మేమిటే...' తన విశాల నేత్రాలను త్రిప్పుకొని ఓరగంటితో చూస్తూ అంది.

'కారణ మేమిటే...మార్పు. సహజం... అనివార్యం'...ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చొని పెద్ద తత్వవేత్తలా ఫోజు పెట్టి అన్నాడు.

'ఓహో—అలాగా?'...కొత్తిగా చిన్న



కిళ్లీ నాలిక క్రింద జమకట్టేసినట్లు కళ్లు తిప్పుకొంటూ అతనికేసి చూసి హేళనగా అంది—కొద్ది సేపాగి.

'ఇతంతా 'ప్రసాద్' అనుకరణ...నా మాట యధార్థమే ననుకొంటాను. ఏమం టారు?'...కేవలం అతనిని ఉడికించటం కోసం అడిగింది. అవమానంతో దహించు కొనిపోయి నిగ్రహించుకోలేని నిష్ఫలమైన కోపంతో, అతను ఎలా ప్రవర్తించుతాడో చూసి ఆనందించాలని — తన ప్రత్యు త్తరంకోసం ఎదురు చూడసాగింది.

'అవును...ఇది ప్రసాద్ కు అనుకరణే... ఆవిషయంఒప్పుకోటానికి నేనుసిగ్గుపడటం లేదు...ఇతరుల గొప్పతనం మనం గుర్తించ గల్గుతున్నామంటే, మన బలహీనతలు మనం తెలుసుకోగల్గుతున్నా మనుకొంటాను. ప్రసాద్'నుండి నేను నేర్చుకోవాల్సినవి ఎన్నో ఉన్నాయి—దీన్ని మీ నాన్నగారే మొదట నాకు గుర్తుచేశారు...ప్రసాద్ బి.ఏ. నేనూ బి.ఏ...కాని అతని కిచ్చినంత గౌరవం నా కివ్వడు మీ నాన్న...అప్పుడు నాకేమని పించిందంటే విద్యార్హతలను మించిన విలువ 'ప్రసాద్'లో ఉందనిపించింది.

కేవలం అభిమానానికి కూడా ఆతను డాబులు చెప్పుకోలేదు. అతని మాటల్లో ఆతని మాలిన్యంలేని మనసు— మంచిశిక్షా సంస్కారం—వ వి క సి త మనోవికాసమూ కనిపించాయి. అతను ప్రసాద్‌ను అంతగా ఆకాశాని కెత్తడాన్ని గూర్చి ఆలోచించి వెంటనే జవా బిచ్చింది.

'ఓహో నేను ఊహించినది నిజమే నన్నమాట...ప్రసాద్ ప్రభావం మీపై చాలా ఉంది—అందుకనేనా ఇదివరకులా 'టై' కట్టుకొని 'ఇన్‌షర్ట్' వేసికొని తిరగటం లేదు?...ఎందుకీ పెద్దతనం తెచ్చిపెట్టు కోవటం-ఏ వయస్సులో ఉండే కోరికలూ— చేష్టలూ ఆ వయస్సులో ఉంటే బాగుం టుంది. ఏమిటో అంతా ముంచుకుపోయి నట్లు పెద్దమనిషిలా లాల్చీలూ-ధోవతులూ —పైజమాలూ...ఇవిమాత్రం మీరు ప్రసాద్‌నుండి నేర్చుకోకండి. నేను తనతో కూడ ఈ విషయాలలో అనేకసార్లు ఘర్షణపడ్డాను...

(ఇంకా ఉంది)

# వారఫలం

**21-7-1967 శుక్రవారం మొదలు**
**27-7-1967 గురువారం వరకు.**

**మేషం :** ఆదాయంయోగం మొలాగ ఉన్నా, అన్ని వ్యవహారాల్లోను గౌరవ ప్రయత్నాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు వారం మధ్యలో లాభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం లభించ గలదు. వారాంతంలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడ తాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి విద్యావకాశాలు లభిస్తాయి.

**వృషభం :** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. స్థిరాస్థి వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. దైవ కార్యాలు నెరవేరతాయి.

**మిధునం:** వారం ప్రారంభంలోనే వృత్తివ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడం తగదు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు శ్రమ మీద నెరవేరతాయి. సంతోషకరమైన వార్తలను వింటారు. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం:** వృత్తివ్యాపారాల్లో మీకార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. వారం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. దూర ప్రయాణాలు వాయిదా పడతాయి. ఉద్యోగంలో ఉన్నవారి నెక్కువగా నమ్మడం తగదు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**సింహం:** మీకు యిష్టం లేకపోయినా, యితరుల వ్యవహారాల్లో జోక్యం చేసుకోవలసి వస్తుంది. రావలసిన డబ్బుమీద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడం తగదు. కాలం ఆఖరులో అనుకోని చికాకులకు గురి కాగలరు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**కన్య :** వ్యాపారంలో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించ గలవు. సాటివారితో వాద ప్రతివాదాలు తగవు. నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది.

స్త్రీలకు:— కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. బంధుమిత్రులనుకల్సుకొంటారు.

**తుల :** కొన్ని వ్యవహారాల్లో అనుకోని శ్రమ కలిగినా, దానికి తగిన ప్రతిఫలం లభించ గలదు. వృత్తిలో ప్రయోజనం గల వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. ఉద్యోగంలో అధికారుల అభిమానాన్ని పొందగలరు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం :** వృత్తివ్యాపారాల్లో మీకార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. కొన్ని వ్యవహారాల్లో కార్యసాధన కోసం మీ అభిప్రాయాలకు వ్యతిరేకంగా వ్యవహరించ వలసి వస్తుంది. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. ప్రయాణాలో చనలు చేస్తారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**ధనుస్సు :** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. వృత్తిలో సాటివారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించ గలరు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. సాంఘిక వ్యవహారాల్లో మీప్రాముఖ్యత పెరుగుతుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మకరం :** వృత్తివ్యాపారాల్లో యిదివరకు యేర్పడిన చికాకులు తొలగి పోతాయి. నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. ప్రయాణంద్వారా కార్యసాధన చేయుగలరు. సాహిత్యకళారంగాల్లో మీకృషి రాణించ గలదు. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. బంధుమిత్రులను కల్సు కొంటారు.

**కుంభం :** కొన్నివ్యవహారాల్లో మీరు యెంత మంచిగా ప్రవర్తించినా, అది యితరులకు చెడుగానే కన్పిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో మంచిపరిస్థితి యేర్పడుతుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించ గలరు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగానే ఉంటుంది. అధిక వ్యయం జరుగుతుంది.

**మీనం :** వ్యాపారంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. వారం మధ్యలో అధిక వ్యయం జరగడం వలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. మీతాలూకు వస్తువులు పోవచ్చును. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు: — కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

—మహేష్







# ధర్మపథం

# ఏది ఉత్తమ పురుషార్థం?

బులుసు వెంకటరమణయ్య

ధర్మ, అర్థ, కామ, మోక్షాలనే నాలుగు పురుషార్థాలలో ఏది ఉత్తమమైనది? అనే ప్రశ్నకు అవకాశం లేక పోలేదు.

వీటిలో మొదటి మూడు యిహలోకానికి సంబంధించినవి. చివరది పరలోకానికి సంబంధించినది. ఐహికములన్నీ తాత్కాలికాలనీ, మోక్ష మొక్కటే శాశ్వతమనీ చెప్పుదురు.

పురుషులు సాధించవలసిన యివన్నీ ముఖ్యమైనవే! కాని, ఒక విశేషమున్నది. లౌకిక దృష్టితో చూస్తే అర్థమే ప్రధానమైనది. పారలౌకిక దృష్టిలో మోక్షమే ముఖ్యమైనది,

వాస్తవానికి—మోక్షం కూడా అర్థ పురుషార్థం వల్లనే సాధించడానికి అవకాశం ఉన్నది. అందువల్ల అర్థమే అన్నింటికంటే ఉత్తమమని చెప్పవచ్చును.

ధనం వల్ల సాధింపరానిది ఏదిన్నీ లేదు.

మన నియమిత ధర్మాలు నిరాటంకంగా కొనసాగుతూ ఉండాలంటే మనస్సు యే చీకుచింతలూ లేకుండా ఉండాలి. ఇంట్లో ఎట్టి లోటుపాటులూ లేనప్పుడే మనస్సుకు నెమ్మది. అది అర్థం మీదనే—ధనం మీదనే ఆధారపడి ఉన్నది. మన కోరికలు నెరవేరడానికిన్నీ అదే మూలం. అందువల్ల కామ పురుషార్థం అర్థ పురుషార్థం మీదనే నిలబడాలి. మోక్షహేతువులైన పుణ్యకర్మలూ, దేవాలయాది నిర్మాణమూ అర్థం మూలంగానే సులభంగా నెరవేరతాయి.

డబ్బుపేరు వినబడితే కొండమీది కోతి కూడా దిగి వస్తుందని చెప్తూ ఉంటారు.

'ఏమి డబ్బు శాశ్వతమా? అది మనల్ని గడించిందా? మనం దాన్ని గడించామా?' అని పైకి మాటలు చెప్పే వారు కూడా మనస్సులో డబ్బంటే గొప్పదనే భావించేవారే!

పెద్ద పెద్ద విరోధాలకీ, యుద్ధాలకీ కారణం యిదేకదూ!

కౌరవపాండవుల కలహానికి కారణం రాజ్యకాంక్షే కదా! అంటే సంపద పొందాలనే కోరిక!

ధృతరాష్ట్రుడు అభిమానించి పాండవులకు అర్ధరాజ్యం యిచ్చినా, కౌరవులు దాన్ని వారికి దక్కనీయకుండా ఎన్నో మాయోపాయాలు చేశారు. లక్కయింటిలో పాండవులను పెట్టి ఆ గృహాన్ని దహింపచేశారు. కపటద్యూతం ఆడించారు. రాజ్యాన్ని లాక్కోవడమే కాకుండా ద్రౌపదికి మానభంగం చెయ్యడానికి కూడా యత్నించారు. పాండవులు ఎలాగో యీ కష్టాలనుండి తప్పించుకున్నారు.

తుదకు వారు జీవితకోసం మారువేషాలతో తిరిపం కూడా ఎత్తవలసి వచ్చింది.

పాండవులు సామాన్యులా? అసహాయశూరులు! వీరాగ్రేసరులు! విద్యలన్నిట్లోనూ ఘనులు. అయితేనేమీ? అకించనులు; అందువల్లనే నానాపద్దలూ పడ్డారు!

అర్జునుడి బలపరాక్రమాలనూ, విద్యనూ ఎరిగిన ద్రుపద మహారాజు తన పుత్రిక అయిన కృష్ణను (ద్రౌపదిని) అతనికిచ్చే వివాహం చెయ్యాలని సంకల్పించుకున్నాడు. లాక్షా గృహం దగ్ధమైపోయినప్పుడు పాండవులు ఆ గృహంలో ఉండడం వల్ల మరణించారని జనులు చెప్పుకొంటున్నందువల్ల మహావీరుని పరీక్షించడానికి మత్స్యయంత్రాన్ని ఏర్పాటు చెయ్యవలసి వచ్చింది. ఆ యంత్రాన్ని మారువేషంలో ఉన్న అర్జునుడే పడగొట్టి ద్రౌపదిని దక్కించుకొన్నాడు. తల్లి ఆదేశానుసారం ఆమెను పాండవులు అయిదుగురూ వివాహమాడవలసి వచ్చింది.

గర్భవతి అయిన కోడలు అత్తగారికి నమస్కారం చేసినప్పుడు ఆమె 'నీ కడుపు చల్లగా వంశానికి పేరు ప్రతిష్ఠలు తెచ్చే పుత్రుల్ని కనవలసింది' అని దీవించడం పరిపాటి. ద్రౌపది తనకు నమస్కారం చేసినప్పుడు కుంతీదేవి ఏమి అంటున్నదో వినండి—

'భాగ్యవంతం ప్రసూయేథాః  
మా శూరం మా చ పండితమ్,  
శూరాశ్చ కృత విద్యాశ్చ  
మమ పుత్రా వనం గతాః'

'ఓ కోడలా! పరాక్రమవంతుడూ, విద్వాంసుడూ అయిన కొడుకుని కనవద్దు. ఐశ్వర్యవంతుడైనవానినే కనవలసింది. పరాక్రమమూ, విద్యా నిరుపయోగాలు, ఏమంటే—శూరులూ, గొప్ప విద్వాంసులూ అయిన నా కుమారులు అడవులు పట్టిపోవలసి వచ్చింది; వాళ్లకు ఐశ్వర్యం లేకపోవడం వల్లనే యీ గతి పట్టింది' అని దీని భావం.

అంచేతనే అర్థమే ఉత్తమ పురుషార్థమని చెప్పవలసి వస్తున్నది.

అయితే ఒక మాట.

లౌకిక సుఖాలు కావలసినవారి విషయంలోనే యీ మాట వర్తిస్తుంది. లౌకికాలతో సంబంధం లేని వారికో ఇది తృణప్రాయమే! ●

మారియోన్ ఎలెన్

# గొప్పవాళ్లెప్పుడూ భార్యలకు ఋణపడి ఉంటారు!

'జీవితంలో ఘనవిజయాల్ని సాధించిన ప్రతిపురుషుని వెనుక అందుకు మూల కారణమైన ఒకస్త్రీ ఉంటుంది' అన్న పాతసామెత ఆ విషయాలపై పరిశోధన సల్పిన ఓ సంస్థ కృషిద్వారా మరింత బలపడింది. కొందరు జీవితంలో జయప్రదంగా తామనుకున్నవి సాధించడం, అంతే తెలివి తేటలున్న మరికొందరు విజయాన్ని సాధించలేకపోవటం ఎందుకు జరిగిందో ఈ సంస్థ పరిశోధనలద్వారా విశదమైంది. స్వయంకృషితో 30 సంవత్సరాలలోనే కోటీశ్వరుడైన పాల్ జె. మేయర్ 'ఘన విజయాల్ని సాధించిన చాలామంది వ్యక్తుల జీవితాల్లో వారి భార్యలకు ప్రముఖ పాత్ర ఉంది' అంటారు.

'పోటీదార్లపై విజయాన్ని సాధించి తన గమ్యాన్ని చేరుకోడానికి పట్టుదల, ఆత్మ విశ్వాసం అన్నవి ముఖ్యాంశాలు' అంటారు శ్రీ మేయర్. 'ఈ సంకల్పాన్ని అర్థం చేసుకున్న భార్య ప్రతిబంధకాలను అధిగమించి భర్త ఉన్నతస్థితి నందుకోడానికి తోడ్పడుతుంది.

'స్త్రీలోఉన్న ఈ ప్రభావాన్ని ప్రపంచంలోని ముఖ్యసంస్థల, వ్యాపారకేంద్రాల యజమానులు తక్కువగా అంచనా వేస్తున్నారు.' అని శ్రీ మేయర్ ఆందోళన చెందుతున్నారు. 'భర్త అభివృద్ధిని అంచనా వేసేందుకు ఒక పురుషునికి ఎలాంటి భార్య ఉన్నదో, గృహ వాతావరణం ఎలాంటిదో, దంపతుల మధ్య నెలకొనిఉన్న అభిమానాలను, భర్త గమ్యాన్ని గూర్చి భార్య దృక్పథం మొదలగు వాటి నన్నిటినీ లెక్కకు తీసుకొంటారు.' అని సక్సెస్ ఎక్స్‌పర్ట్ ఒకతను అన్నారు.

టెక్సాస్‌లోని వాకోలో ఉన్న మేయర్ స్వంతసంస్థ సక్సెస్ మోటివేషన్ ఇన్‌స్టిట్యూట్, పురుషులు వారి భార్యల ప్రాముఖ్యతను గుర్తించడానికి ప్రోత్సాహిస్తుంది. కానీ వారివారి వ్యాపారాల్లో వారి భార్యలు కేవలం 'అయిదో చక్రం' వంటివారు కాదు. ఇద్దరూ కలిసి ఒకే గమ్యాన్ని సాధించడానికి, కలిసి పనిచేయడానికి ఈ సంస్థ ఉత్సాహాన్నిస్తుంది. అందువల్ల భర్త సాధించిన విజయంలో భార్యకుకూడా అధిక భాగం ఉండటం కద్దు.

మహిళలలోదాగిఉన్న ఈమహత్తరశక్తిపై నమ్మకం ఉన్నది కాబట్టే ఈ సంస్థ వ్యక్తుల సంకల్పబలాన్ని, మార్గదర్శకులవడానికి కావలసిన శక్తిని అధికం చేయడానికి తోడ్పడటంలో పేరుపొందింది.

'ఒక్కొక్కప్పుడు మగవారు గమనించలేని విషయాల్నికూడా మగువలు గమనిస్తారు. ఎన్నో సమస్యలు ఈ 'ఆరవప్రాణం' సహాయ సహకారాలతో సానుకూలపడ్డ సాదృశాలెన్నో ఉన్నాయంటారు పాల్ మేయర్.

## గమ్యాల్ని నిర్ణయించుకోడం:

విజయాల్ని సాధించాలంటే గమ్యాన్ని నిర్ణయించుకోడం అన్నది ముఖ్యం అంటారు శ్రీ మేయర్. ఇలాంటి సందర్భాలలో వనిత సలహా దానికి బలాన్ని చేకూరుస్తుంది.

భర్త విజయాలను సాధించాలన్న భార్యలకు ఈ క్రింది సూచనలు ఎన్నోపరిశోధనల అనంతరం సూచింపబడినవి:

1. కాగితంమీద మీ కుటుంబం యొక్క ఆశయాలను, ఆదర్శాలను సంవత్సరం పొడుగునా వారంవారం, నెలనెలావారీగా కార్యక్రమాన్ని రూపొందించుకోవాలి. ఇది ఖచ్చితంగా ఉండాలి. ప్రతి అంశం ప్రక్కనా దానిని సాధించడానికి ఎదురయ్యే అవరోధాలను, అధిగమించడానికి మార్గాలను రాసుకోవాలి. ఒక్కొక్క విజయాన్ని సాధించాల్సిన తేదీని నిర్ణయించుకోవాలి. ఈ పథకంలో జీవితంలోని అన్ని అంశాలు— తెలివితేటలు, కుటుంబసంబంధమైన, ఆత్మసంబంధమైన, సాంఘిక, భౌతిక, ఆర్థిక — విషయాలను కూడా చేర్చాలి. మామూలుగా ప్రతి వ్యాపారానికి సంవత్సరం ముందుగానే ప్రణాళికను

# డాక్టర్ కబుర్లు

## చిన్నపిల్లల ఆహారం వెచ్చగా ఉండాలా?

చాలామంది చిన్నపిల్లలకి ఇచ్చే పాలు, మొదలయిన ఆహార వస్తువులు దేహం వేడి కలిగి ఉండాలనుకుంటారు. ఇటీవల న్యూయార్క్‌లోని 'బెల్ వ్యూ ఆస్పత్రి'లో జరిగిన పరిశోధనలని బట్టి ఇది అనవసరం అని తోస్తుంది.

తొమ్మిది నెలలు నిండకుండా పుట్టిన శిశువులకి సయితం చల్లటి పాలు పట్టగా వారి ఆరోగ్యానికి ఏ హానీ కలగలేదు!

ఈ పరిశోధనలలో 2000 'వెచ్చ ఆహారం, 2000 'చల్ల ఆహారం, ప్రయోగాలు జరిగాయి. 'చల్లఆహారం అంటే సుమారు 39 డిగ్రీల ఫారన్‌హీట్ ఉష్ణోగ్రతలో ఉంచినవన్నమాట, వెచ్చనివి అంటే సాధారణంగా వెచ్చటి నీళ్లలో పెట్టి వేడి చేసినవి.

ఈ పరిశోధనల వల్ల ఎంతోలాభం కలిగింది. పాలు వేడిచేసి కాలం వృధా చెయ్యనక్కరలేదు, పాలు మరీవేడిగా



ఉన్నాయేమోనన్న భయమూ అనవరం!

హెచ్. ఎల్. హెర్షన్‌సోన్
(కాపీరయిటు)

## గొప్పవాళ్ళెప్పుడూ...

రూపొందించుకోవడం జరుగుతుంది. వ్యక్తులకు కుటుంబాలకు కూడా అదే విధానం వర్తిస్తుంది.

2. ప్రపంచంలోని గొప్పవ్యక్తుల జీవితాల్లో అతిముఖ్యమైన విషయం, నిశ్చయమైన అభిప్రాయాన్ని కలిగి ఉండటంలో మీ భర్తకు సహాయపడండి. ఎస్.ఎస్.ఐ. పరిశోధనలు గొప్పవ్యక్తుల్లో సాధారణంగా కన్పించే అంశం వారు తమ సామర్ధ్యంమీదే కానీ, బలహీనతలపైన, రుణాలపైన దృష్టిని కేంద్రీకరించరు అని నిరూపించాయి. భర్త వృత్తిమీద భార్య యొక్క దృక్పథం అన్నది అతని కార్య నిర్వహణపై సూటిగా, దృఢంగా ఆధారపడి ఉంటుంది.

3. మీ భర్త జీవితగమనంపై ఆసక్తిని, ఉత్సాహాన్ని పెంపొందించుకోండి. అలా ఆసక్తిని పెంపొందించుకోడం అతను తనకు ఎదురైన ప్రతిబంధకాలను అధిగమించటానికి అవసరం.

4. చేతనైనమార్గాలలో మీ భర్తకు ఎప్పుడూ సహాయపడండి. కాగితంమీద ప్రణాళికను రూపొందించడం, లేక నియమ నిబంధనలను, ఏర్పాటులను తయారు చేయటం మొదలైనవి. ఈ పద్ధతివల్ల మీ భర్తకాలాన్ని వృధాకాకుండా ఉండటమే కాకుండా మీరు, మీ కుటుంబం ఆనందంగా గడపటానికీ ఎక్కువకాలం మిగుల్తుంది.

5. మీ భర్త విశ్వాసాన్ని పెంచడం అన్నది అతిముఖ్యమైన విషయం. ప్రతిరోజూ భర్త యిల్లు వదిలిపెట్టి తన పని చూసుకోడానికి వెళ్ళినప్పుడు తన భార్యకు తనమీద పూర్తి నమ్మకం ఉందనుకొంటే అతను తన పనిలోని సమస్యలను చక్కగా పరిష్కరించుకోగలడు — అతను ధనహీనుడైనా, ధనవంతుడైనా.

'ఇంకో పాత వానుడి ఉంది' పాల్ మేయర్ ఇంకా ఇలా అన్నారు, 'ఈనాటికీ ఎప్పటిమాదిరిగా అర్ధవంతమైనది ఏది?— 'పురుషుడెప్పుడూ పరాజయాన్ని పొందడు. అతనిభార్య అలా అనుకుంటే తప్ప' అన్నది.

—(ఇన్‌ఫో)

# జయదేవుడు

అది పన్నెండవ శతాబ్దం. జగన్నాధపూరీలో దేవాలయంలో తోటమాలి కూతురు శ్రీకృష్ణ భజన పాడుతోంది. ఇది అంత విశేషమని అప్పటికి ఎవరూ అనుకోలేదు కాని మర్నాడు గర్భగుడి ద్వారం తెరిచినప్పుడు దేవుడి వస్త్రాలు చిరిగి ఉండటం చూసి రాజుగారూ, అర్చకులూ కూడా కలవరపాటు చెందారు. ఇది ఎలా జరిగిందో వారికి తెలియలేదు. రాత్రిపూట తలుపులు తాళం వేసి ఉంచుతారు! ఆ రాత్రి వారికి శ్రీకృష్ణ భగవానుడే కలలో కనిపించి తను తోటమాలి కుమార్తె పాటవిని నాట్యం చెయ్యకుండా ఉండలేక పోయానని చెప్పాడు: వస్త్రాలు తోటలోని చెట్ల కొమ్మలకి చిక్కుకుని చిరిగి పోయాయన్నాడు!

అయితే ఆ అమ్మాయి పాడిన పాట పుణ్యస్థలంలో తప్ప పాడరాదని శాసించాడు రాజుగారు.

భగవంతుడి చేతనే నాట్యం చేయించిన ఈ పాట ఏమిటి? జయదేవుడి గీతగోవిందం! ఇంతకన్నా సుందరమయిన భక్తి రసపూరితమయిన కావ్యం ప్రపంచంలోనే లేదంటారు పండితులు. ఇందులో అతిశయోక్తి ఏమీలేదని చదివిన వారందరూ అంగీకరిస్తారు.

జయదేవుడు వంగదేశంలోని కెందుబిల్వమనే గ్రామంలో జన్మించాడు. చిన్నప్పుడే తలిదండ్రులని కోల్పోయాడు. చిన్నప్పుడే అతనికి శ్రీకృష్ణుడంటే అపారమయిన భక్తి ఏర్పడింది. ఎప్పుడూ శ్రీకృష్ణుడి పేరు స్మరిస్తూ భక్తి ఆవేశంలో మునిగిపోయేవాడు. వయస్సు వచ్చిన తర్వాత కేవలం ఒక మట్టి పాత్రతో ఊరు వదిలి వెళ్ళిపోయాడు. జగన్నాధపూరీ చేరుకున్నాడు.

అక్కడ అతని భక్తి ఆవేశం మరింత అధికం అయింది. ఈ లోకంలో దేనిమీదా మమకారం పెంచుకోరాదని అతను అన్ని విధాలా జాగ్రత్త పడేవాడు. చివరికి ఒకే చెట్టుకింద రెండుసార్లు పడుకోవటం కూడా మంచిది కాదనుకునేవాడు. ఇంత వైరాగ్యం చూపించే జయదేవుడే చివరికి వివాహం చేసుకుంటాడంటే ఎవరు నమ్మగలిగేవారు, అప్పుడు!

పూరీలో సుదేవశర్మ అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతను సంపన్నుడు. చాలా కాలంగా బిడ్డలులేక చివరికి ఇలా మొక్కుకున్నాడు—తనకి పుట్టిన మొదటి శిశువుని జగన్నాధుడికే అంకితం ఇస్తానని. మొక్కుకున్న కొద్దికాలంలోనే అతనికి కల ఒకటి వచ్చింది. తనకి పుట్టబోయే కూతురిని జయదేవుడికి ఇవ్వమని ఆజ్ఞ!

కుమార్తె కలిగిన కొంతకాలం తర్వాత ఆమెని జయదేవుడి వద్దకి తీసుకువెళ్ళి భార్యగా స్వీకరించమని కోరాడు. జయదేవుడు గృహస్థాశ్రమాన్ని స్వీకరించటానికి ఇష్టపడలేదు. 'ఇది శ్రీకృష్ణుడి ఆజ్ఞ, ఎలా కాదనగల'వని సుదేవుడు ప్రశ్నించగా ఇక గత్యంతరం లేక అంగీకరించాడు.

మరికొంతకాలం గడిచింది. భార్యాభర్తలిద్దరూ పూరీ వదిలి కెందుబిల్వ గ్రామానికి వెళ్ళిపోయారు, అక్కడ ఒక గుడిలో అతను శ్రీకృష్ణ విగ్రహం ప్రతిష్ఠ చేయించాడు. జయదేవుడి సతీమణి కూడా గొప్ప కృష్ణభక్తురాలే. ఇద్దరూ నిరంతర కృష్ణ పూజలో మునిగి పోయేవాడు...

జయదేవుడికి తన భార్య పద్మావతి అంటే కూడా చాలా ప్రేమ. వీరి ప్రేమని గురించి వింతకథ ఒకటి చెప్పారు—కాని దానిని మరొక చోట చెప్తాను!

—ఎస్.

# మటన్ పులావ్

దీనికి కావలసిన సామానులు.—

| | |
|---|---|
| సన్నబియ్యం పాతవి | 1 కిలో |
| మాంసము | 1 కిలో |
| నెయ్యి | ¼ కిలో |
| ఉల్లిపాయలు | ¼ కిలో |
| అల్లం | 50 గ్రా. |
| వెల్లుల్లి | 50 గ్రా. |
| జీడిపప్పు | 100 గ్రా. |
| పచ్చిమిరపకాయలు | 200 గ్రా. |
| లవంగాలు | 10 గ్రా. |
| దాసినచెక్క | 10 గ్రా. |
| యాలక్కాయలు | 5 గ్రా. |
| ముదురు కొబ్బరికాయ | |
| కొత్తిమీర | |

ముందుగా అల్లం, వెల్లుల్లి పొట్టు తీసి కడిగి, మెత్తగా నూరి వుంచాలి. లవంగాలు, యాలక్కాయలు, దాసినచెక్క మూడిట్లో సగం తీసేసి మిగతావి ధనియాలు వేసి, మెత్తగా నూరాలి. కొబ్బరి కోరి మెత్తగా రుబ్బి వుంచుకోవాలి. పచ్చి మిరపకాయల్లో ఒక 20 కాయలు తీసి, మిగతావి కొంచెము నేతిలో వేయించి, వాటిని కూడా, మెత్తగా నూరాలి. ఉల్లిపాయలు పొడవుగా చీలికల్లాగ తరుక్కోవాలి. తీసి వుంచుకున్న పచ్చిమిరప కాయలు నిలువుగా గాటు పెట్టాలి.

ఇవన్నీ తయారు చేసుకున్నాక, మాంసము పెద్దముక్కలుగా కోసి, శుభ్రంగా కడిగి, వెల్లుల్లి, అల్లం ముద్దను వేసి కాస్త నెయ్యి, ఒక కప్పు పెరుగు, కూరకు తగినంత ఉప్పు, పసుపు, సగ్గు ఉల్లి ముక్కలు వేసి ఒక గ్లాసు నీళ్ళు పోసి, కుంపటి మీద ఆ పాత్రను పెట్టి నీరు ఇగిరే ముందు మసాలా ముద్ద, కొబ్బరి ముద్ద వేసి కలిపి, దింపెయ్యాలి.

బియ్యం శుభ్రంగా బాగుచేసి, కడిగి, నాని కుండా పొడి బట్ట మీద ఆరబోసి వుంచాలి. తర్వాత వెడల్పు మూతి, అడుగు దళసరి గల, 2 కిలోలు ఉడికే పాత్ర, కుంపటి మీద పెట్టి బాగా కాలనిచ్చి, సగం నెయ్యి వేసి బాగా కాగాక, వుంచుకున్న దాసినచెక్క, లవంగాలు, యాలక్కాయలు వేసి, కొంచెం వేగనిచ్చి, జీడిపప్పు వేసి కాస్త వేగాక కూరలో వేయగా మిగిలిన వుల్లి ముక్కలు, పచ్చి మిరపకాయలు వేసి దోరగా వేగాక, ఆరబోసిన బియ్యం అందులో పోసి, రెండు నిమిషములు వేగనిచ్చి, రెండు సేర్ల నీరు పోసి, తగినంత ఉప్పు వేసి కలిపి మూత పెట్టాలి. 10 నిమిషములు వుడికాక, వండి వుంచిన కూరను ఇందులో వేసి, అంతా కలిసేలా కలియబెట్టి, మిగతా వున్న నెయ్యి పోసి, కొత్తిమీర సన్నగా తరిగి దానిపై చల్లి, దళసరి గుడ్డను తడిపి ఆ పాత్ర మూతికి గాలి పోకుండా కట్టాలి. దానిపై పళ్ళెం మూతవేసి, పళ్ళెంపై ఎర్రటి నిప్పులు వేయాలి. క్రింద సెగ తగ్గించి, మాడకుండా జాగ్రత్తగా చూడాలి. అలా 15 నిమిషములు వుంచి, అన్నం వుడికిందో, లేదో చూసి దింపెయ్యాలి. దీనిలో యిష్టమున్నవారు వుదీనా ఆకును త్రుంచి వేసుకోవచ్చు.

దీనిలోకి మామూలుగా చేసుకొనే వుల్లిపాయ పెరుగు పచ్చడి చేసుకుంటే బాగుంటుంది.

## మామిడిహల్వా - బర్ఫీ

మామిడిపండ్లు బాగా వచ్చేకాలం, అందరూ చేసుకోదగినవి ఇవి.

### మామిడి హల్వా

బాగా ముగ్గిన తియ్యని మామిడిపండ్లు శుభ్రంగా కడిగి, తొక్క తీయకుండా తురిమి, ఒక స్టీల్ పాత్రలోకి రసం పిండవలెను. ఈ రసం ఒక కప్పు వుంటే ఆ కప్పుతోనే ఒకకప్పు పంచదార, కొద్ది నీరు పోసి కుంపటి మీద పెట్టి, లేతపాకం వచ్చాక కప్పుడు మామిడిపండ్ల రసమును అందులో పోసి, బాగా కలుపవలెను. 15 నిమిషములు అడుగంటకుండా కలుపుతూ వుండాలి. అప్పుడది హల్వాగా మారును. తర్వాత యీ హల్వాను కుంపటి నుండి దింపి, కొంచెం యాలుకు పొడి వేసి కలిపి, బాగా చల్లారాక, వెడల్పు మూతిగల సీసాలో వేసి వుంచుకుంటే, పది రోజుల వరకూ, నిలువయుండును.

### బర్ఫీ

పై విధంగానే, ఒక కప్పు రసమునకు, ఒక కప్పు పంచదార తీసికొని పై మాదిరిగానే లేత పాకం పట్టాలి. రసం వేరే పాత్రలో వేసి కుంపటి మీద పెట్టి, రసం గట్టిపడే వరకూ, కలుపుతూ వుండాలి. అప్పుడు యీ గట్టిపడిన రసమును, పాకంతో వేసి అంతా కలిసేలా కలుపుతూ, గట్టిపడే వరకూ వుంచి, తర్వాత దానిని కుంపటి మీద నుండి దించి ఒక పళ్ళెంనకు నెయ్యి రాసి అందులో వేసి, సమంగా, సర్దికన్పైన యాలుకు పొడి చల్లాలి. అది చల్లారాక డైమండ్ ఆకారంలో ముక్కలుగా కోయాలి. ఇది కూడా చాలా రుచిగా, బాగుంటుంది. ఎందుకైనా మంచిది, ముందుగా కొంచెంకు కొద్దిగా చేసి చూడండి. తర్వాత మీకు నచ్చితే, చేసుకోవచ్చు.

## శ్రీయరాళి

సెనగపప్పు (పొట్టు పప్పు) పావు కేజి నానబోసి నానాక శుభ్రంగా కడిగి, బట్టలో వేసి నీరు పోనివ్వి, రోట్లో వేసి అంత మెత్తగా కాకుండా నీరు పోయకుండా, రుబ్బాలి. ఒక గిన్నెలో 2 గ్లాసుల నీళ్ళు పోసి, తడిబట్ట వాసన కట్టి, ఆ రుబ్బిన పిండిని కుడుము మాదిరిగా వండాలి. కుడుము వుడికాక దించి, ఒక స్టీల్ పళ్ళెంలో వేసి, చిన్న చిన్న ముక్కలుగా కోయాలి. కుంపటిపై స్టీల్ గిన్నె పెట్టి తగిన నూనె వేసి, ఎండు మిర్చి ముక్కలు, మినపప్పు, సెనగపప్పు, ఆవాలు పరిపడినన్ని వేసి దోరగా వేగాక, పచ్చిమిర్చి ముక్కలు, కరివేపాకు వేసి కొద్దిగా వేగనిచ్చి, తయారు చేసుకున్న కుడుము ముక్కలు యీ పోపులో వేసి, తగినంత వుప్పు, పసుపు కూడా వేసి అంతా కలిసేలా కుదిపి, రెండు నిమిషములు కుంపటిపై వుంచి, తర్వాత దించి దానికి తగినంత నిమ్మకాయ రసం వేసి, కలిపి మూత పెట్టాలి. నిమ్మరసం బదులు, చింతపండు పులుసు, పచ్చి మామిడి కాయ కోరు కూడా వేసుకోవచ్చు. తయారయిన వెంటనే కాక ఒక గంట ఆగి టిఫిన్‌గా తినడానికి రుచిగా చాలా బాగుంటుంది.

— కె. [illegible]



# మెదడుకి మేత



డాక్టర్ మహీధర నళినీమోహన్

## ఆరువరుసలు



(క) ఆరు వరుసలు:

ఏడు చింతగింజలు తీసుకుని, వరుసకు మూడేసి గింజలుండేలా ఆరు వరుసలలో అమర్చడం ఎల్లాగ?



(చ) కోతి—బిచ్చగాడు:

అదొక మూడంతస్థులమేడ. అందులో పన్నెండు కుటుంబాలు కాపురం ఉంటున్నాయి. అక్కడికొక బిచ్చగాడు కోతిని తీసుకువచ్చి ఆడించాడు. ఆఖరున ప్రేక్షకులు ఇచ్చే డబ్బులు తీసుకురావడానికి కోతినే పంపించాడు. ఆ కోతి చాలా తెలివైనది. ఇటువంటి పనులలో అది ఆరితేరింది. కోతి బొమ్మలో చూపిన చోట బయలుదేరి, చెంగుచెంగున కిటికీ మీద నుంచి కిటికీ మీదికి దూకుతూ, వాళ్ళు ఇచ్చిన డబ్బులు తీసుకుంటూ, వెళ్ళిన కిటికీ దగ్గరకు మళ్ళీ వెళ్ళకుండా, ఆ పన్నెండు కిటికీలనూ కనిష్ఠ మార్గంలో చుట్టి, ఆఖరున బిచ్చగాడి భుజం మీదికి చేరింది.

అది ప్రయాణం చేసిన దారి ఏది?

* * *

## కోతి-బిచ్చగాడు



## తేనెటీగలు



(ట) తేనెటీగలు:

తేనె పట్టులోని ఈగలలో ఐదవ వంతు కదంబ పుష్పాల మీద ఉన్నాయి. మూడవ వంతు సురపొన్న పువ్వుల మీదికి వెళ్ళాయి. ఈ రెండింటి భేదానికి మూడు రెట్లు మొగలిపువ్వుల దగ్గరకు వెళ్ళాయి. ఒక ఈగ మాత్రం మందార మాలతి పుష్పాలతో దేనిని ఎన్నుకోలేక రెండింటి వాసనలకూ చొక్కి, అటూ ఇటూ ఎగురుతోంది. మొత్తం అపట్టులోని ఈగలెన్ని?

* * *

## కుతుబ్ మినార్



(త) కుతుబ్ మినార్:

ఒకడు కుతుబ్ మినార్ పైకి ఎక్కి, అక్కడి నుంచి ఒక బంతిని కిందికి జారవిడిచాడు. బంతి కిందపడి, పైకిలేచి, మళ్ళీ లేచి, మళ్ళీపడి...ఇల్లా కొన్ని వందల పొర్లు జరిగి ఆఖరికి కొంతసేపటికి నేల మీద స్థిరంగా నిలబడింది. ప్రతిసారి అంతకు ముందు లేచిన ఎత్తులో పదవ వంతు ఎత్తుకి మాత్రమే లేస్తుంది బంతి. కుతుబ్ మినార్ ఎత్తు 326 అడుగులు అనుకుంటే, ఆ బంతి మొత్తం ఎంత దూరం ప్రయాణం చేసింది?

### జవాబులు




(క)

ఈ సమస్యకి పై బొమ్మలో చూపినట్లు రెండు జవాబులు ఉన్నాయి. వాటిలో మొదటి త్రిభుజములో శీర్షములనుండి ఎదుటి భుజములకు లంబరేఖలు గీయబడ్డాయి. కాని మూడూ ఒక బిందువులో

(64వ పేజీ చూడండి)



# గురువుగారి రహస్యం

ఒకసారి కోటలోని వంటసాలలో ఒక బంగారపు గిన్నె కనిపించలేదు. వంటసాలలో మొత్తం వలభై మంది పనిచేస్తున్నారు. ఆ పనివాళ్ళు తప్ప మరెవరూ అక్కడకు వెళ్ళలేదు కాబట్టి వారిలోనే ఒకరు యీ దొంగతనం చేసిఉండాలి.

విన్నివిధాల ప్రయత్నం చేసినా, దొంగతనం యెవరుచేసినదీ తెలియలేదు. అప్పుడు రాజు, దొంగను పట్టుకోవలసినదిగా, మల్లన్న మంత్రిని ఆదేశించాడు.

మల్లన్న మంత్రికూడా వలభై మంది పని వాళ్ళకూ నయానా, భయానా, చెప్పి చూసేడు కాని ప్రయోజనం లేకపోయింది. మల్లన్నమంత్రి పని వాళ్లతో యిలాగ అన్నాడు.

'మీకు నేను యెంత చెప్పినా మీరు వినలేదు. మంత్రశాస్త్రం తెలిసిన మా గురువుగారు ఉన్నారు. వారు యిక్కడకువచ్చి తమ మంత్ర శక్తివలన దొంగను పట్టుకొంటారు.'

మరునాటి ఉదయం ఊరిబయటను ఉన్న కాళికాదేవి ఆలయానికి ప్రక్కగా ఒక గుడారాన్ని వేసేరు. ఆ గుడారపు ద్వారాన్ని మూసి ఉంచేరు. మల్లన్న మంత్రి మాత్రం లోపలకు వెడుతుండేవాడు బయటకు వస్తుండేవాడు కాని మిగిలినవారికి లోపల యెవరున్నదీ తెలియదు. నాలుగడుగుల యెత్తున గుడారానికి ఆరంగుళాల కైవారంగల రెండు కన్నాలు ఉన్నాయి.

రాజభటులు వలభై మంది పని వాళ్లనూ అక్కడకు తీసికొనివచ్చేరు. మల్లన్నమంత్రి పనివాళ్లతో యిలాగ అన్నాడు.

# మల్లన్న మంత్రి

కౌటిల్య

'గురువుగారు యిప్పుడు కాళికాదేవికి ప్రత్యేకమైన పూజచేసేరు. మీరందరూ, ఒకరి తరువాత ఒకరు లోపలకు వెళ్ళి అమ్మవారి పాదాలను పట్టుకొని తాము దొంగతనం చేయలేదని చెప్పాలి. దొంగతనంచేసిన వాళ్ళు అమ్మవారి పాదాలను పట్టుకొన్నప్పుడు మాత్రం ధ్వజస్తంభానికి ఉన్న గంటలు వాటంతట అవి మ్రోగుతాయి. దేవాలయంలోనికి వెళ్ళివచ్చిన తరువాత మీ చేతులను గుడారపు చిల్లులద్వారా గురువుగారికి చూపించాలి.'

ఒకరు వెళ్ళివచ్చిన తరువాత ఒకరుగా వలభై మంది పనివాళ్ళూ దేవాలయంలోనికి వెళ్లేరు. బయటకు వచ్చిన తరువాత తమ చేతులను గుడారపు కన్నాల్లో ఉంచి గురువుగారికి చూపించేరు.

వలభై మంది పనివాళ్ళూ లోపలకు వెళ్ళివచ్చేరు కాని ధ్వజస్తంభం గంటలు మాత్రం మ్రోగలేదు. మల్లన్న అప్పుడు గుడారంనుండి బయటకు వచ్చేడు.

మీలో యిరవైనాల్గవ పనివాడు దొంగతనం చేసినట్లు గురువుగారు నాతో చెప్పేరు. అని మల్లన్నమంత్రి చెప్పగానే ఆ యిరవై నాలుగవ పనివాడు భయపడిపోయి దొంగతనం తనే చేసినట్లుగా ఒప్పుకొన్నాడు. ఆ బంగారపు గిన్నెను తాను యెక్కడ దాచినదీ తెలియపర్చగా రాజభటులు దానిని స్వాధీనం చేసికొన్నారు.

'మీ గురువుగారు చాలా సమర్థులు ఒకసారి వారి దర్శనం చేద్దామని ఉంది' అని రాజు మల్లన్న మంత్రితో అన్నాడు.

'ప్రభూ! మాగురువుగారు ఇక్కడకు రాలేదు. దొంగను పట్టుకొనే ఉందుగ్గాను నేనే అలాగ అందరితోను చెప్పేను' అని మల్లన్నమంత్రి రాజుకు చెప్పేడు.

'అయితే దొంగను యెలాగ పట్టుకొన్నా'వని రాజు ప్రశ్నించగా మల్లన్న మంత్రి తాను పన్నిన వ్యూహాన్ని రాజుకు తెలియజేశాడు.

'మా గురువుగారు వస్తున్నారు వారు యెవరినీ చూడరు.' అని చెప్పి అర్చకులతో సహా అందరినీ దేవాలయంనుండి పంపివేశేను. తరువాత యెవరికీ తెలియకుండా అమ్మవారి పాదాలకు అత్తరువు పూసేను. దేవాలయంలోనికి వెళ్లివచ్చిన తరువాత ఒక్కొక్కరు గుడారంలోనికి చేతులను చాసేవారు. గుడారం లోపల నుంచి నేను చేతులను వాసన చూసే వాణ్ని. ఇరవైనాల్గవ పనివాడు తనే దొంగతనం చేయడంవలన, భయపడిపోయి అమ్మవారి పాదాలను ముట్టుకొనలేదు. అందుచేత అతని చేతులకు అత్తరు వాసనలేదు. కనుక ఇరవైనాల్గవ పనివాడే దొంగ అని తేలింది.'

ఈ సమాధానం విని రాజు చాలా సంతోషించి మల్లన్నమంత్రిని యెంతగానో గౌరవించేడు. ●

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## 1967 దీపావళి కథల పోటీ

ఎప్పటివలెనే ఈ సంవత్సరంకూడా "ఆంధ్రసచిత్రవారపత్రిక దీపావళి కథలపోటీ" నిర్వహించబోతున్నదని తెలపటానికి సంతోషిస్తున్నాము, రచయితలందరూ ఎప్పటివలే మాతో సహకరించి ఈ పోటీని జయప్రదం చేస్తారని ఆశిస్తున్నాము.

**మొదటి బహుమతి రు. 1600**

**రెండవ బహుమతి రు. 900**

**మూడవ బహుమతి రు. 500**

### నిబంధనలు

1. కథలు స్వంత రచనలై ఉండాలి. ప్రతి కథతోనూ రచయిత అది తన స్వంతరచనేనని' దేనికీ అనువాదంకానీ, అనుసరణకానీ కాదనీ హామీగా రాసి పంపాలి. ఈ హామీలు వేరే కాగితం మీద కాక కథ వ్రాతప్రతి మీదనే రాసి ఉండాలి.

2. కథలు తెలుగువారి జీవితానికి సంబంధించి ఉండాలి.

3. వ్రాతప్రతి మీద "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. కాగితానికి ఒక వైపు మాత్రమే సిరాతో రాయాలి. రచయిత పేరు, పూర్తి చిరునామా కూడా వ్రాతప్రతి మీద స్పష్టంగా రాయాలి. రచనలు 12 అరఠావు (ఎక్సర్సయిజు నోట్‌బుక్ పేజికి రెండు రెట్లు) పేజీలకు మించరాదు.

4. కవరు మీద "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. పోటీకి రచనలు 'సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్, మద్రాసు—1' కి పంపాలి.

5. పోటీకి గడువు తేదీ 31—8—67. ఆ తర్వాత మా కార్యాలయం చేరిన కథలని మామూలుగా ప్రచురణకి పరిశీలిస్తాము.

6. పోటీలో బహుమతి పొందిన కథలని 'దీపావళి ప్రత్యేక సంచిక'గా 3—11—1967 తేదీకల ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రచురిస్తాము.

7. పోటీ తుదినిర్ణయం ఆంధ్రసచిత్రవారపత్రిక సంపాదకుడిదే. ఈ విషయమై ఎటువంటి ఉత్తరప్రత్యుత్తరాలూ జరపడానికి వీలులేదు.

8. వ్రాతప్రతులని ఎటువంటి సందర్భంలోనూ తిప్పి పంపడానికి సాధ్యంకాదు. పోటీలో పాల్గొనేవారు తమ రచనలతో తపాలాబిళ్లలు అతికించిన స్వంత చిరునామా కల కవర్లు పంపనవసరం లేదు.

9. పోటీలో బహుమతి పొందక మామూలుగా ప్రచురణకి స్వీకరించిన కథల రచయితలకి ఆ విషయం ప్రచురించే ముందు తెలుపుతాము.

# మానిసిలో మనిషి



భట్టిప్రోలు బాలకృష్ణరావు

'శరబయ్య తాగటం మానేశాడంటరా!' అన్నాడు వెంకన్న. 'ఎట్టా?' అని ఆశ్చర్య పోయాడు పుల్లిగాడు.

'యెదవ వాయిలు...!' తాగటంలో రుచి తెలియక చప్పబడిపోయిన శరబయ్య గురించి విన్నప్పుడు, ఈరిగాడికి అసహ్యమేసింది. 'ఈరిగాడు ఐదోగ్లాసులో వున్నాడు మరి!

'బొత్తిగా సెడిపోనాడు పన్నాసోడు. యెవళ్ళో సెడుబుద్దులు సెప్పుండాల!' అంది సారా దుకాణం సూరమ్మ

పెద్దవాళ్ళ సావాసంపట్టి వాళ్ళమాటలు విని తాగడం మానేశాడని సూరమ్మ అభిప్రాయం.

'ఏమే సూరమ్మా ఒకే వాటా ఎగిరి పోంది...' అన్నాడు సోమిగాడు, గ్లాసు అందిస్తూ.

'సుప్పనాత్రోళ్ళు. నే బాగుపడ్డం యిట్టం లేదు. అందుకే యారో శరబయ్యకుకి మా రి పోశారు.' అంటూ శాపనార్థాలు పెట్టింది సూరమ్మ.

అవును మరి శరబయ్య తాగటమంటే మాటలా? ఒక పట్టాన వదిలిపెట్టడు. గ్లాసుమీద గ్లాసు ఏడెనిమిది గ్లాసులన్నా లాగిస్తాడు. బేరంపోయిన సూరమ్మ గోల పెట్టదు మరి?

'శరబయ్యగాడికి దుబుద్ధి ఎందుకు పుట్టిందంటావ్—'

'యేమో...పెళ్ళాంగాని యేమన్నా కూకలేసిందేమో—'

'శళ్ళ...పెళ్ళాం గూకలేయడ మేందిరా? ...వొరెత్తితే తాటి బద్దలుకొట్టేవాడు శరబయ్య. నే నెరగవా అంట!'

'కొడుకు పోవాక మారిపోనాడురా...'

'ఏడిశాడు. అది అట్టా మానేరకమా?'

'మరేం జరిగిందంట?'

'అదే నేనూ అడుగుతూంట'

ఎంతోకాలంనుంచి తప్పతాగడానికి అలవాటుపడ్డ శరబయ్య, ఒక్కసారిగా తాగడం మానేసేసరికి దుకాణదారు సూరమ్మతోపాటు అందరికీ ఆశ్చర్యం కలిగింది. ఈ ఆశ్చర్యం ఊరంతా పాకింది.

* * *

ఎక్కడికీ వెళ్ళకుండా ఇంటివద్దనే కూర్చుంటున్న శరబయ్యనిచూస్తే అతని భార్య కాంతమ్మకి ఎక్కడలేని ఆనందమూ కలిగింది. కొడుకుపోయిన దిగులే లేదు. పూర్తిగా మరచిపోయింది.

దగ్గరగాకూర్చుని

'యేంటి మావా దిగులుగావున్నావ్...' అని అడిగింది.

'నేను తాగడం మానేశా...' అన్నాడు శరబయ్య.

అదిరిపడింది కాంతమ్మ.

'ఎందంటా?' అని రెట్టించి అడిగింది.

'అవునే ... నేను తాగడం మానేశా. నీమీదొట్టు' అన్నాడు శరబయ్య.

కాంతమ్మ నమ్మలేదు. అంత క్రితం ఇలాంటి ఒట్లు ఎన్నో అయినాయి.

కానీ ఆమె అంతరంగం ఏదో ఆలోచిస్తూ వుంది. శరబయ్యలో మార్పుంది. కొత్తరకంమార్పు.ఏమిటో ఈ వెలుగు?కాంతమ్మకు అర్థం కావడంలేదు.

ఈసారి మావచెప్పినమాట నిజమేనేమో అనిపించింది.

'ఏంమావా...నువ్వింత మంచివాడివెలా అయ్యావుమావా ... ఏదేవత నన్ను చల్లగా సూసిందో?' అంటూ అతని తలను సవరించింది.

'అవునే...! దేవతో, దెయ్యమో నాకు తెలవదుకాని ... నేనుమాత్రం ఇక తాగను. తాగనంటే తాగను' అన్నాడు నిశ్చయం ధ్వనించే కంఠంతో శరబయ్య.

కాంతమ్మ సంతోషానికి అంతులేదు. ఆరోజు నుంచీ ప్రతిరోజూ ఆమెకు పండగే అవుతుంది.

'మరి నీకు దిగులెందుకు? అట్టా గూసుంటావేం ... వణ్ణం కూడా సరిగ్గా తిన్లేదు...?' అంది కాంతమ్మ.

'ఆకల్లేదే...'

'ఎందుకునేదు...? తాగితే ఆకలవుద్దా యేంటి?'

'శళ్ళ...అదికాదే ... ఎందుకో మనసంతా అగ్గిలావుందనుకో...'

'తాగుడు మీనకు పోనాదేమో...'

'అబ్బబ్బ నీగోలే నీది ... నామాట యింటేనా?' అని.

'పనికోసం తిరిగేదేంటి...?' అన్నాడు.

శరబయ్య నోటినుంచి వెలువడుతున్న మాటలన్నిటినీ రత్నాల్లా ఏరుకుంటోంది కాంతమ్మ.

శరబయ్యలో మార్పొచ్చింది. ఎంతో మార్పొచ్చింది. దేవుడు కరుణించాడు. పోలేరమ్మకు యాట నేయాలి...!-ఇదే ఆలోచన కాంతమ్మకి.

* * *

'యెల్లుమావా...యెల్లు ... పనికోసం సూడు. అందర్లోనూ తలెత్తుకు తిరుగుదాం. నీలాంటి మగోడుండగా నాకేంది లోటు...?

నువ్వు నా దేవుడివి మావా...దేవుడివి. అంటూ అతనిమీద వాలిపోయింది కాంతమ్మ.

పనికోసం ఊరుమీదపడ్డాడు శరబయ్య.

శరబయ్యలో అకస్మాత్తుగా యింతటి మార్పు రావడానికి కారణం ఆమెకూ తెలుసు.

కొడుకు పోయినా మావ మనిషవుతున్నందుకు ఆమెకు ఎంతగానో ఆనందంగా వుంది.

కొడుకుపోతే మళ్ళీ వస్తాడు.

మావపోతే మళ్ళీ రాడు...!—ఇదీ ఆమె నమ్మకం.

ఆమె దృష్టి చచ్చిపోయిన ముగ్గురి పిల్లలమీదికిపోయింది.

ముగ్గురూ మగపిల్లలే. ఒకడు పుట్టాకతోనే పోయాడు. రెండోవాణ్ని పోలేరమ్మ ఎత్తుకుపోయింది. మూడోవాణ్ని తలచుకుంటున్నప్పుడు కాంతమ్మకు దుఃఖం ఆగిందికాదు.

రాక్షసుడిలాంటి మావ మనిషయ్యాడు అనుకుంది, గతాన్ని గుర్తుతెచ్చుకుని.

* * *

రత్తాలుకి అప్పుడు నాలుగోఏడు. ముద్దుముద్దుగా మాట్లాడుతుండేవాడు. వాడి మాటలకి కాంతమ్మ తెగ మురిసిపోయేది.

'ఇద్దర్నెత్తుకుపోయావు. ఈడినైనా దక్కించు తల్లీ' అంటూ ఏడుకొండలవాడికి చేతులు జోడించేది. కంటికిరెప్పలా కాపాడుకునేది.

పగలంతా కూలి పనిచేసి, తర్వాత అవధానిగారింట్లో అంట్లు తోమి చాలా రాత్రయేటప్పటికి యింటికొస్తుండేది.

రత్తాల్ని యింట్లో వకణ్ణీ వుంచడానికి యిష్టంలేక, శరబయ్యమీద నమ్మకంలేక కూలి పనికెళ్ళినా, ఎక్కడికెళ్ళినా కూడా బెట్టుకు తీసుకు వెళ్తుండేది.

ఎంత శ్రమపడినా ఆమెకు శ్రమ అనిపించేదికాదు. పడ్డ కష్టమంతా రత్తాల్ని చూసుకుని మరచిపోయేది.

'మాయదారి దేవుడు తిన్నగానోడుకాదు! చూసి వోర్వలేడు.'

ఇంటికొస్తే చాలు శరబయ్య తందనాలు ఎదురయ్యేవి.

'యేడపోయినావే రంకుముండా!' అంటూ తెగబాదేవాడు.

కాంతమ్మ ఎన్నిచెప్పినా తప్పతాగిన శరబయ్యకి వినిపించేదికాదు.

శరబయ్యకి పనిపాటూవుండేదికాదు.

కాంతమ్మ తెచ్చినదంతా శరబయ్య తాగుడుకోసమే అయిపోయేది.

పెళ్ళాం కూడుతిందా లేదా అనిగాని, కొడుకు పోషణ సరిగా వుందాలేదా అనిగాని, అతనికి వుండేదికాదు. ఎంతసేపూ తన తాగుడు, తనూను.

తాగుడికి డబ్బులివ్వకపోతే తన్నేవాడు. తిండి పెట్టకపోతే కొట్టేవాడు.

పాపం అన్నీ భరించుకొంటూ, తాళిబొట్టును నమ్ముకొన్న కాంతమ్మ అలానే కాలం గడుపుతూ వుండేది.

ఆ రోజును తలుచుకున్నప్పుడు కాంతమ్మకి భయం వేసింది. అది మరపురానిరోజు. ఆమె జీవితంలో కత్తివాటువంటి రోజది.

ఊళ్లో ఎక్కడా పనుల్లేక పోవడంతో ఒక్క అంట్లుతోమేపని మాత్రమే వుండేది. కాంతమ్మకి డాంలో చాలా కష్టమైపోయింది.

శరబయ్య కోపానికి అంతులేక పోయేది.

రోజూ యిచ్చే డబ్బులు కాంతమ్మ ఇవ్వకపోయేసరికి కట్టలు తెంచుకు ప్రవహించింది.

కొట్టాడు. కొట్టాడు ... చేతులు నొప్పెట్టే వరకు కొట్టాడు. తర్వాత కత్తిపీట కాంతమ్మ మీదికి గట్టిగా విసిరి, కాంతమ్మ ఏమయిందోనని కూడా తెలియకుండా దుకాణం వేపు వెళ్లి పోయాడు.

గురి తప్పిన కత్తిపీట కాంతమ్మని చంపలేదు. కాని కత్తిపీట పీట మాత్రం కాంతమ్మ గుండెల్ని ముద్దెట్టుకుంది.

కాంతమ్మ అరవలేదు. అసలు మొగుడు ఎన్ని తిట్టినా కొట్టినా పైకి ఏమీ అనదు.

ఇప్పుడు అరవకపోవడానికి కారణం అది కాదు. దెబ్బ అంత గట్టిగా తగిలింది. నేల కూలిపోయింది కాంతమ్మ.

ఆమెకు స్పృహవచ్చేసరికి ప్రక్కనున్న పిల్లవాడు గుక్కతిప్పుకోకుండా ఏడుస్తున్నాడు.

లేవబోయింది. వంట్లో శక్తిలేదు. ఎలాగయితేనేం బలాన్నంతా కూడదీసుకుని రత్తాల్ని వళ్ళో కూర్చోబెట్టుకుంది.

రత్తాలు ఎంత సేపటినుంచి ఏడుస్తున్నాడో, ఏమో,...ఆమె చేతుల్లో...వో... మెలికలు తిరిగిపోతున్నాడు.

పిలిచ్చేదానిక్కూడా ఆమెకు శక్తిలేదు.

ఆ సమయానికి శరబయ్య మళ్ళా వచ్చాడు. ఈసారి అతని కళ్ళు జ్యోతుల్లా వెలిగిపోతున్నాయి. రోజూకన్నా ఎక్కువగానే తాగాడు.

'వచ్చి కూడెట్టవే...' అన్నాడు.

కాంతమ్మ పలకలేదు. పలకలేకపోయింది.

'లంజముండా!' అంటూ లేచి ఆమె వళ్ళో ఏడుస్తున్న పిల్లాణ్ణి చేతుల్లోకి లాక్కుని విసిరేశాడు.

అంతే!!

* * *

'కేర్'మని అరిచింది కాంతమ్మ. అప్పుడే ఇంట్లో అడుగుపెట్టిన శరబయ్య ఆమె దగ్గరికి పరిగెత్తుకొచ్చి.

'ఏమిటే ... ఏమయింది?' అన్నాడు ఆత్రుతగా.

కాంతమ్మ మాట్లాడ్లేదు. అతన్ని కావలించుకొని భోరుమని ఏడ్చింది.

'నేనింక తాగనన్నాను కదంటే...' అన్నాడు శరబయ్య అమాయకంగా.

కాంతమ్మ భోరుమన్నప్పుడు శరబయ్య అలా అనడం అలవాటు!

కాస్సేపటికి మామూలు మనిషయింది కాంతమ్మ.

'దేవుడు మనల్ని సిన్నసూపు సూత్తున్నాడు మావా...' అంది కాంతమ్మ.

# మానిసిలో మనిషి

'అవునే...' అన్నాడు పరధ్యానంగా శరబయ్య.

'ఇప్పుడేం పరవానేదు. నువ్వు మనిసి వయ్యేవుగా...' అంది కళ్ళు తుడుచుకుంటూ.

'ఎక్కడా పని దొరగలేదే...' అన్నాడు శరబయ్య.

'పోన్లే మావా ... రేపు సూద్దువుగాని లే... చెయ్యి కడుక్కురా... వణ్ణం పెడతా' అంటూ లోపలికి వెళ్ళింది. శరబయ్య ఆమెని అనుసరించాడు.

రాత్రి వంటిగంట దాటివుంటుంది. మూలుగు విన్న కాంతమ్మకు మెలుకువ వచ్చింది. ఎక్కడినుంచి విన్పిస్తున్నదా అని నలువైపులా చూసింది.

'మావా...' అంది భయంగా.

శరబయ్య జవాబియ్యలేదు. ప్రతిగా అతని స్వరం వినిపించింది. వణికిపోతూ మూలుగుతున్నాడు దగ్గరకెళ్ళి చూసింది. వంటిమీద చెయ్యేస్తే, చెయ్యి కాలి పోతూంది.

'మావా...ఇదేంటి మావా!...ఇంత జొర మొచ్చేదాకా పలాటాడ కూరుకున్నావ్ ... నేను సచ్చిపోనానుకున్నావా?' అంటూ బెంబేలుపడిపోయింది.

ఈమాటుకూడా శరబయ్య సమాధానం ఇవ్వలేదు.

కాంతమ్మ పిలిస్తే డాక్టర్లు రాలా. శరబయ్యనే వాళ్ళదగ్గరికి తీసుకెళ్ళాలి. అర్థరాత్రి తీసుకెళ్ళినా ఫలితం దక్కదు. 'నిద్దరలో లేపినందుకు డాక్టరు పోసుందుకో మందు ఇచ్చేరయ్యగల్దా?' అనుకుంటూ శరబయ్య పక్కనే కూర్చుని చేతనైన ఉపచర్యలు చేయసాగింది.

తెల్లారింది.

శరబయ్య జ్వరం తగ్గలేదు. పైగా ఏదో సంధిలాగుడు.

అతన్ని మోసుకు డాక్టర్లదగ్గరికి తీసుకెళ్ళే వోపికలేదు కాంతమ్మకు. ఆమెను ఆ పరిస్థితుల్లో ఆదుకొనేవాళ్ళు కూడా కనిపించలేదు.

ఎలానైతేనేం శాస్తుర్లుగార్ని బ్రతిమాలుకుని తీసుకొచ్చింది.

ఆయనేవో మాత్రిపోసి 'మళ్ళా వస్తా'నని వెళ్ళిపోయాడు.

'నేను మంగమ్మగోర్ని సంపేశానే...నేనే సంపేశా...' అని ఏడుస్తున్నాడు శరబయ్య.

ఇదంతా సంధిలక్షణమేనని శాస్తుర్లు చెప్పి వెళ్ళాడు.

గుడ్లనీరు కక్కుకుని, బిక్కు బిక్కుమంటూ అతన్ని చూస్తూ, అతను చెప్పే ప్రతి మాటా వింటూ కూర్చుంది కాంతమ్మ.

'అవునే... నిజమేనే...మంగమ్మగోర్ని నేనే సంపేశాను...' అన్నాడు మళ్ళీ మళ్ళీ.

'శ్శ... వూరుకో మావా...ఆయువు మూడి అమెగోరే పోయారు. నువ్వు సంపడమేంటి?' అంది కాంతమ్మ.

శరబయ్యకి పిచ్చేమోనన్న భయం కూడా ఆమెకు వుంది.

కొడుకు పోయినప్పటినుంచి శరబయ్య అదో మాదిరిగా వుంటున్నాడు. ఆదిలో తెగ తాగేవాడు. రానురాను తగ్గించేశాడు. తాగుడు తగ్గించే కొద్దీ అతనిలో దిగులు ఎక్కువయింది. తాగుడు గురించికాదు. అతనిలో ఏదో మధన ఎక్కువయింది. మనసులో లావా ప్రవహించింది.

మానిసి మనిషయ్యే ముందు పరిణామం!

'నీకు తెల్దే...నేనే సంపేశా..., నేనే...! నీ కొడుకుని కూడా నేనే సంపేశా...' అన్నాడు శరబయ్య.

కొడుకు మాట ఎత్తేసరికి కాంతమ్మ





# దావణగిరి

## టెర్రీ తువ్వాళ్లు

## ప్రవేశ పెట్టబడుచున్నవి




ఇవిఎంతో మృదువుగా,సున్నితంగా,హాయినిచ్చేగుణంగలిగినవి

ది దావణగిరి కాటన్ మిల్స్ లిమిటెడ్.

దావణగిరి (మైసూరు రాష్ట్రం)

సెల్లింగ్ ఏజెంట్లు : ఆర్. హనుమంతప్ప & సన్స్



# మానసిలో మనిషి

భరించుకోలేక పోయింది.

ఈసారి భయపడింది. నిజమేనేమోనని పించిందామెకు.

'నువ్వు పంపడమేంటి మావా... కూడు దొరక్క అమే పచ్చిందంటగా... ఆ మాయ ముండ డబ్బుపాడేసినాది...'

'కాదే...నీకు తెల్దు. నేనే పంపాను.'

అన్నాడు గట్టిగా శరబయ్య. అతను వివరంగా చెప్పాలనుకున్నాడుగాని చెప్పలేక పోతున్నాడు.

* * *

ఆరోజు శివమెత్తినట్టు తిరిగాడు. ఇంట్లో కాంతమ్మను పట్టుకుబాదాడు. వూళ్ళోవాళ్ళందర్నీ పట్టుకుని తిట్టాడు. అయినా అతనిచేతికి డబ్బు దొరకలేదు. ఎవరూ ఇవ్వలేదు. అరువుపెట్టనంది సారా కొట్టు మారమ్మ.

శరబయ్యకి పిచ్చెత్తిపోయింది.

రోడ్డుమీద నడుస్తుంటే అతనికి అదృష్టం ఎదురైంది! అలాగని అతను అనుకున్నాడు.

'ఏం పాపా! ఏడకెల్తున్నావ్...' అన్నాడు మంగమ్మ మనవరాల్ని పిలిచి.

మంగమ్మకు ఎవరూలేరు, మనవరాలు తప్ప.

చేతిలో పదిరూపాయలనోటు గట్టిగా బిగించి 'మందులషాపుకి' అంటూ చీటి చూపించింది పాప.

శరబయ్యలో కొట్టుమిట్టాడుతున్న ఆలోచనలన్నీ ఒక కేంద్రాన్ని చూసుకుని ఆగిపోయాయి.

అతను తాగాలి. వళ్ళుతెలియాలి.

అంతవరకు అతను మనిషికాడు.

'నేనెవరో తెలుసా పాపా నీకు?'

'తెలవదు.'

'పోనీలే...నువ్వు యింటిదగ్గరేవుండు... మీనాయమ్మ నీకోసం ఏడుస్తోంది. నేను మందు తెచ్చిస్తా...'

శరబయ్య మాటలు పూర్తిచేయనేలేదు- పదిరూపాయల కాయితం శరబయ్య చేతిలో పెట్టి మామ్మదగ్గరకు పరిగెత్తింది 'మామ్మా' అంటూ ఏడుస్తూ పాప.

శరబయ్య మందు తేలేదు.

తెచ్చుకున్నాడు!

ఇంటికొచ్చి రత్తాలు శవం చూశాడు మత్తు వదిలింది. చిన్నపిల్లాడిలా ఏడ్చాడు. గుండెలు బాదుకుని ఘోరంగా ఏడ్చాడు.

జుట్టు పీక్కున్నాడు.

చొక్కా చింపుకున్నాడు.

చేతులు బాదుకున్నాడు.

తలవడ్డ గాజికల్లో కొట్టుకుని శరీరాన్ని హొప్పెట్టించుకున్నాడు.

తెల్లవారాక విన్నాడు, మంగమ్మ మరణ వార్త!

అతనూ మనిషే. అతనిలోను మన మంది. మనము కళ్ళు విప్పుకునే వాటికి దాని పరిణామానికి హాతమైన గతం బోల్డుంది.

మంగమ్మ శవానికి పెళోత్సవించాడు. అందరూ ఆశ్చర్యపడేలా.

పాప ఏడ్చి, ఏడ్చి, సొమ్మసిల్లింది.

శరబయ్యలో మనిషిలేచి కూర్చున్నాడు. జ్ఞానోదయం చేశాడు.

పాపను అనాథాశ్రమంలో చేర్పించాలని పెద్దలందరూ తీర్మానించుకుంటున్నారు.

* * *

'రత్తాలు పిలుస్తున్నాదే...' అన్నాడు శరబయ్య

కొమ్మర్లు సంధివాగుడని చెప్పినా, కాంతమ్మ కేదో అనుమానంగానే వుంది.

'నా సేతితో పెయ్యేసి ఒకమాట చెప్పవే...' అన్నాడు శరబయ్య. మాతిత్తో మంచి వొట్టాడినట్టు మాటలు.

'యేంటి మావా...ఇదిగో మవ్వొనాడైనా ఏడైనా చెప్పితే నే కాదన్నావా?'

'అలాకాదు...మాటియ్యవే ...' వలాన్ని గింజుకుంటున్నాడు.

'మం...గ...మ్మ...గారి... పా ..పను... ...ను... వ్వ పెం.. చు ... కో ... నేను... రత్తాలు...ద...గ్గ...రి...'

కాంతమ్మ నిర్ఘాంతపోయింది.

శరబయ్య చావు, అతనికోరిక ఒకలాగే వున్నాయి!

# మోటారు కారు నంబరు ప్లేట్లలో నాలుగు అంకెలకు మించివుండవు కారణమేమిటి?

ఇది చాలామందికి తెలిసిన విషయం. సీరియల్ నంబరు 9999 తో ఆగి పోతుంటకాని 10000 గా వుండదు. అట్లా సీరియల్ సంఖ్య 9999 అయిన తర్వాత, తర్వాతి కారుకు వేరే అక్షరం మార్చిన సంఖ్యే ఉపయోగిస్తారు. అప్పుడు కూడ సాధారణంగా మూడు సున్నలు (0001) తోనే ప్రారంభిస్తారు. దీనికి కారణమేమైన వుందా అంటే, అవునని చెప్పాలి.

మోటారు కార్లెప్పుడూ సాధారణంగా వేగంగానే పోతుంటాయి. ట్రాఫిక్ కానిస్టేబులే కాని, అవసరమైతే మరెవరైనా కాని కారునంబరును గుర్తించుకోవలసి వుంటుంది. అట్లా వేగంగా పోయేకారు నంబరు గుర్తించాలంటే ఏ కొద్ది క్షణాలకో గాని స్పష్టంగా కన్పించదు. ఆ కొద్ది క్షణాల్లోనే దానినిచూసి గుర్తించుకోవలసి వస్తుంది.

ఒకవ్యక్తి స్వల్పవ్యవధిలో ఎన్ని అంకెలను తప్పులేకుండా గుర్తుపట్టగలడు అనేది సమస్య. సాధారణంగా చాలమంది క్షణ వీక్షణంతో నాలుగు అంకెలకంటె గుర్తుపట్టలేరు. ఇలాగ ఒకడు ఎన్ని వస్తువులను క్షణవీక్షణంలో గుర్తుపట్టకలడో దానిని అతని శ్రద్ధా పరిమాణాలం అనవచ్చు. ఈ అవధానంలో వ్యక్తిగత భేదాలున్నా సాధారణంగా అందరూ నాలుగు వస్తువుల దాకా గుర్తుంచుకోగల్గుంటారు.

అట్లయితే కారునంబరు ప్లేట్లలో అంకెలతోబాటు అక్షరాలు వుంటాయికదా! అంకెలే మరి నాలుగున్నప్పుడు ఈ అక్షరాలను కూడ ఎట్లా గమనింపగలమని యెవ్వరేనా అడిగితే, అది మనశ్శక్తి లక్షణమనే చెప్పవలసి ఉంటుంది. ఇలాంటి సందర్భాల్లో చూచే వస్తువులను మనస్సు చిన్న చిన్న మొత్తాలుగా తీసికుంటుంది. కాబట్టి నంబరు ప్లేట్లలో వుండే అంకెలను వొక మొత్తంగానూ అక్షరాలను ఒక మొత్తంగానూ మనస్సు గ్రహిస్తుంది అవాలి. సాధారణంగా వ్యక్తి నాలుగు వస్తువులదాకా శ్రమలేక గుర్తుపట్టవచ్చు కాబట్టి పైన చెప్పినవిధంగా యూనిట్ల లెక్కల్లో గుర్తుపెట్టుకోడం కష్టంకాదు. వుదాహరణకు '1000000' అని రాస్తే అది యెంతో చూచినవెంటనే కనుక్కోడం కష్టంకాని దీన్నే' 1,000,000, అని మూడు మొత్తాలుగా, తీసికొంటే ఒక్క మిల్లియనని (పది లక్షలు) చూచినవెంటనే చెప్పవచ్చు. ఈ యూనిట్ పద్ధతిలో కారు నంబరు ప్లేట్లలో అంకెలు అక్షరాలు గుర్తుంచుకోగలం.

ఇక ఈ శ్రద్ధ పరిమాణాన్ని ఒకవ్యక్తికి ఎలా కనుక్కుంటారు? దీనికి 'టాకిస్కోపు' అనే వుపకరణం తోడ్పడుతుంది. ఇందులో మధ్యని ఒకకార్డు పైనా రంధ్రంకల పలక వుంటుంది. దీని కిరువైపుల పరిశోధితుడూ పరిశోధకుడు కూర్చుంటారు. పరిశోధకుడు రంధ్రంలో చుక్కలుకల కార్డువుంచి పరిశోధితుని రెడీగా వుండమనిచెప్పి ఒక స్విచ్చిని వేస్తాడు.

అప్పుడు వెనుకభాగంలో కార్డువుంచిన పలకక్రింద పడుతుంది. దీనివల్ల పరిశోధితునికి రంధ్రంద్వారా 1/10 సెకనులకు కార్డులోని చుక్కలు కనిపిస్తుంది. తానెన్ని చుక్కలు చూచాడో అతడు చెప్పవలసి ఉంటుంది, ఈ విధంగా కొన్ని పర్యాయాలు 3 మొదలు 8 వరకు చుక్కలకల కార్డులనుపయోగించి యీ పరిశోధన చేస్తారు. మీరుకూడ చిన్నచిన్న ముద్దముక్కలని మీగుప్పిట్లో వుంచుకొని క్షణమాత్రం తెరచిచూపి. వారెన్ని వస్తువులవరకు సరిగా చెప్పగలరో చూడవచ్చు.

—వి. నటరాజన్.




కష్టం తెసుకొబట్టేగదా
నాయనా మా ఆవిడతో
మరో అట్సై పోయాను!


ఓరేయ్! నామాట విను!
అమ్మాయి వాళ్ళన్న ఓ పెద్ద వస్తాదు!!



# ప్రమాదంలో

✻ బాలి


ఆకతాయిల
రత్తయ్య
జోలికి..
పోవొద్దురా
అంటే విన్నావు
గాదు!


ఛీ ఛీ పాడు గుర్రం -
వెధవ గుర్రం!


ఇక్కడ పారాచూట్లు
తయారు చేయబడును
PARACHUTES










# ప్రమోదం

Jayadev










యస్. యస్. యల్. సి. పరీక్షల్లో వేణు కాపీలు పట్టుకుంటాడు శంకరం మేష్టారు. శంకరం గారి మంచితనాన్ని గ్రహించిన వేణు అక్కయ్య జ్యోతి వేణుని శంకరంగారి దగ్గరకి ట్యూషనుకు పంపిస్తుంది. జ్యోతి, బావ ఆనందరావును వివాహం చేసికొంటుంది. కారణం లేకుండానే శంకరానికి వరదరాజులు ప్రత్యర్థిగా తయారవుతాడు. ఆనందరావు, తమ్ముడు రంగడికి విద్యాబుద్ధులు గరపాలనే వుద్దేశంతో తనదగ్గరకు రప్పిస్తాడు. శంకరం మాస్టారి ప్రభావంవల్ల వేణు ప్రవర్తన చాలవరకు మారిపోయింది. అతను అక్టోబరు ఛాన్సులో స్కూలు ఫైనలు పాసయ్యాడు. శంకరం పైన తను వరదరాజులు ఆయన్ని పోలీసు కేసులో యిరికిద్దామని వేసిన పథకాన్ని వేణు విఫలం చేస్తాడు. ప్రాణస్నేహితురాలయిన జ్యోతి, రమణలు కలుసుకుంటారు.

# 13

బండి ముందుకు పొగుతుంటే రవణా, జ్యోతీ వాళ్ల కబుర్లు గతంలోకి పరుగెత్తాయి. 'ఫిఫ్త్‌ఫారంలో మనం ఎక్సకర్షనుకు వెళ్లాం జ్ఞాపకముందీ?' అన్నది రవణ బాధాపూరితమైన వర్తమానం మర్చిపోయి, వాళ్ల స్నేహం సృష్టించిన భరాత కాలాన్ని గుర్తుకుతెస్తూ...

'ఉండవల్లిగుహలు చూడ్డానికి వెళ్లాం గదూ...ఇద్దరం బంతిపూలు కోసుకుంటూ చేలగట్లమీద పోటీపడి పరుగెత్తాం. అక్కడ గుహలు చూసి కృష్ణ ఒడ్డుకు నడిచాం... వాకాంోజులు తల్చుకుంటే యిప్పుడు జరిగినట్లుగా అనిపిస్తుందే రవణా...!' అంది జ్యోతి గతాన్ని తల్చుకుని. 'అప్పుడే కదటా నువ్వు పులిహోర పట్టుకొచ్చావ్. నాకు క్యారియర్ మోసుకురావడం సిగ్గేసి ఏమీ తెచ్చుకోలేదు. అప్పుడు యిద్దరం కలిపి అదే చెరికొంచెం తిన్నాం జ్ఞాపకముందీ ?... నేను 'వద్దు వద్దంటున్నా 'నువ్వు తినందే నేను తిననని' మొండికెత్తి తినిపించావ్.'

'అప్పుడు ఏ సినిమాకు జ్యోతీ అందరం కలిసి వెళ్లాం? తిరిగి వచ్చేసరికి చీకటి పడింది. ప్రొద్దుపోయిందని, మాయింట్లోనే భోజనంచేసి, ఒక్క మంచంలోనే పడుకున్నాం యిద్దరం. అన్నిటికంటె నాకు 'డ్రాయింగ్ బుక్' యిచ్చి నువ్వు ఆక్లాసులో ఎండలో నిలబడ్డావ్!...అది ఎప్పుడూ జ్ఞాపకం వస్తుంటుంది నాకు జ్యోతీ!...'

'అది కాదు రవణా!...నువ్వు పుస్తకం

తేజోవతి

తెచ్చుకోడం మర్చిపొయ్యావనుకో... పోనీ నేనిచ్చాగదా...చక్కగావేసి చూపించకుండా 'యిది నాది కాదండీ' అని ఎందుకు బయటపెట్టడం?...' అంది అప్పుడు జరిగినట్లు నిష్ఠూరంగా జ్యోతి.

'బాగుందే! నీ పుస్తకం నాకిచ్చి నువు ఎండలో నిలబడితే నేను దొరసానిలా కూచోనా?...అందుకే చెప్పేశాను...'

'అప్పుడావిడ యిద్దర్నీ ఎండలో నిలబెడితే బాగుందేమిటి?...' అని కోప్పడింది జ్యోతి.

'అవునా!.. ఆ శిక్షేదో యిద్దరం అనుభవించాం! అంతేగాని నా బదులు నువు అనుభవిస్తానంటే నా మనసొప్పుతుందా?' అన్నది రవణ ...

ఇద్దరూ అలాగే గత స్మృతులు తల్చుకుంటూ కబుర్లు చెప్పుకుంటున్నారు... మిగతా వాళ్ళు (బండిలోవున్న వాళ్ళు) 'అదుగో వూరొచ్చింది' అనేదాకా వాళ్ల ఆ కబుర్లలో మునిగిపోయివున్నారు...ఊరి పొలిమేరల్లో కొచ్చామనగానే రవణకు జ్యోతికి ఒక్కసారి బాధేసింది ... ఒకరి ముఖంలో కొకరు చూచుకున్నారు దిగులుగా.

'జ్యోతీ!...మా యింటికిరావూ?...మా పిల్లల్ని చూడవూ?...' అని అడిగింది రవణ ప్రాధేయపడుతూ...

'తప్పకుండావస్తాను రవణా. ఒక్క వూళ్లోవుంటూ రాకుండా ఎలావుంటాను?'

'అట్లా కాదు...ఇప్పుడే రావాలి. ఒక్కడుగు మా యింటిదాకావచ్చి పిల్లల్ని చూసి వెళ్లిపోవచ్చు...'

'ఇప్పుడు కాదు. తర్వాత వస్తానన్నాగా?'

'హు...ఇప్పుడేకదే స్నేహం చెడిపోలేదంటివి!...ఇంతకూ నువ్వూ మారిపొయ్యావన్నమాట!...ఏంచెప్పినా నీకు విరోధులమే అయ్యామన్నమాట!' అంది రవణ నిష్ఠూరంగా.

'ఛీ! ఛీ! అదెప్పటికీకాదు. ఈ కక్షలూ పార్టీలు యివ్వాళుంటయి రేపు పోతయి. స్నేహం ఆ జన్మాంతం నిలిచేది. నీటిబుడగల్లాంటి యీ రాజకీయ విరోధాలకోసం స్నేహం వదులుకొనేంత మూర్ఖురాల్నికాను రవణా!...' అంది చాలా నొచ్చుకుంటూ జ్యోతి.

ఇంతలో వూరి పొలిమేరరాగానే భద్రమ్మగారు బండి ఆపించి రమ్మని పిలిచింది జ్యోతిని...మొఖం వేలేసుకుని కూర్చున్న రవణను చూసి జ్యోతి యిక వెళ్లకపోతే రవణ బాధపడుతుందని, భద్రమ్మగారితో 'మీరు వెళ్లండి...నేనిప్పుడే వచ్చేస్తాను', అంది.

భద్రమ్మగారికి ఏంచెయ్యాలో తోచలేదు... 'జ్యోతీ!...మళ్లీ యీసారెప్పుడైనా వెళ్లదువుగాని రావమ్మా...మాకూడా పిల్చుకొచ్చినందుకు, యింటిదగ్గర దిగబెడితే మర్యాదగావుంటుంది...' అన్నది...

'ఫర్వాలేదు...నేను రాగలను లెండి...' అంది జ్యోతి...ఇక ఏవిధంగా చెబితే జ్యోతి అర్థంచేసుకుంటుందో తోచక గొణుక్కుంటూ వెళ్లి బండి ఎక్కింది భద్రమ్మగారు...ఆవిడెక్కిన బండి అటు కుడివైపు రోడ్డుపట్టింది, జ్యోతివున్న బండి ఎడంచేతివైపుకు మలుపు తిరిగి, రెండుసందులు దాటి పెద్ద పెంకుటింటి ముందు ఆగింది.

అందరూ బండి దిగారు ... రవణా వాళ్ల యిల్లు పెద్దలోగిలి, వాకిలిముందు గొడ్లపాక. ప్రక్కగా గడ్డివాము, ఒక ప్రక్కగా వడ్లపాతరవున్నయి. రవణ భర్త వెంకట్రావు స్కూలుఫైనలు పాసయ్యాక యింటిదగ్గరేవుండి వ్యవసాయం చూసుకుంటున్నాడు. ఆ వూళ్లో ప్రతిపక్షానికి

అతడే నాయకుడు. ఇవతల ఆనందరావుకు ఎంత బలగముందో, యించుమించు అంత బలగమూవుంది వెంకట్రావుకు కూడా... ఆస్తి, పలుకుబడి విషయంలోనూ అంతే... ఇద్దరూ సమవుజ్జీలు.

జ్యోతి లోపలికొస్తుంటే, యింటిముందు వసారాలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్న వెంకట్రావు, అతడి అనుయాయులు తెల్లబోయి చూశారు. రవణ జ్యోతిని సరాసరి వెంకట్రావు దగ్గరకు తీసుకువెళ్ళి పరిచయంచేసింది. జ్యోతి చిరునవ్వుతో నమస్కరించగానే వెంకట్రావు తెల్లబోయి, తొట్రుపడుతూ, 'నమస్కారం...' అన్నాడు. ఆ తర్వాత తన పిల్లల్ని అందర్నీ చూపించింది జ్యోతికి.

'జ్యోతీ!...ఇది మా పెద్దమ్మాయి... దీనికి నీపేరుపెట్టాను జ్యోతిర్లక్ష్మి... అని...' అంటూ అందర్నీ పేరుపేరునా పిల్చి పిల్లల్నందర్నీ చూపించింది...జ్యోతికి రవణ యింటికి రావడం, దానిపిల్లల్ని చూడడం సంతోషంగానేవుంది కానీ అంతరాంతరాలలో ఏదో భయం ఒకటి హెచ్చరిస్తూనేవుంది.

'జ్యోతీ!...లే. లేచి మొహం కడుక్కో... ఇదుగో తువ్వాలూ సబ్బూ...కాస్త ఎండదెబ్బయినా తగ్గుతుంది.' అన్న రవణతో, 'ఏం వొద్దు రవణా!...ఇంటికెళతాగా...' అంది జ్యోతి. 'మరేం ఫర్వాలేదు యింటికెళ్ళేదాకా ఆజిడ్డు మొఖం వుండక్కరలేదు...చక్కగా టాయ్‌లెట్ అయి విరావారి ముందు కెళితే 'ఐసయి'పోతారు ... ఊఁ లే. లేచి మొహం కడుక్కో...' అని రవణ బలవంతం చేసేసరికి తప్పనిసరిగా లేచి మొహం కడుక్కొనివచ్చింది జ్యోతి ... అప్పటికే యిద్దరికీ పీటలూ, కంచాలుపెట్టి వడ్డించింది రవణ... 'వొద్దు రవణా!... నేనింటికి వెళ్ళి భోంచేస్తాను. నువు తిను' బ్రతిమాలుతున్నట్టు అన్నది జ్యోతి.

'అయితే నాతోబాటు భోంచెయ్యడానిక్కూడా నువు యిష్టపడటం లేదన్నమాట!...హుఁ...ఇంతలో మనుషు లెంత మారిపోతారు!...అయినా నాపిచ్చిగాని...... ప్రెసిడెంటుగారి భార్య మాబోటి వాళ్ళ యిళ్ళలో తింటుందా?...' అంటూ కళ్ళనిండా నీళ్ళుపెట్టుకుని గబగబా, పీటలూ కంచాలూ తీసేసింది రవణ.

'అదేం నీకంచం కూడా తీసేస్తావ్?'

'చెప్పానుగా?...నువ్వు మారినా నేమారలేదని!...స్కూల్లో యిద్దరికీ కారియర్లు వచ్చేదాకా కనిపెట్టుకువుండి అప్పుడు భోంచేసేవాళ్ళం...ఒకళ్ళను వొదిలి ఒకళ్ళం ఎప్పుడు తిన్నాం చెప్పు...నువు మర్చిపోయినా నేమర్చిపోలేదు జ్యోతీ!...'

'అబ్బబ్బ!...ఏం మారినా ఏం మారకపోయినా నీ మొండిపట్టు మారలేదే తల్లీ...' అంటూ వచ్చి పీట వాల్చుక్కూర్చుంది జ్యోతి. రవణ నవ్వుతూ వడ్డిం



# పూర్వా సంధ్యా ప్రవర్తతే..

చింది యిద్దరకూ...భోజనం చేస్తుంటే స్కూల్లో మర్రిచెట్టు క్రింద యిద్దరూ ఒకరికూరలు ఒకరు పంచుకుని తింటున్న రోజులు జ్ఞాపకం వచ్చాయి 'కల్మాకపటు మెరుగని ఆరోజులే బాగున్నయి' అనుకున్నారిద్దరూ ... భోజనాలయ్యాక యిద్దరికా కాసేపు కబుర్లు చెప్పుకున్నారు ...

చీకటిపడేవేళకు దడదడలాడే గుండెలతో యిల్లు చేరుకుంది జ్యోతి...ఆనందరావు హాల్లోనే కూర్చుకున్నాడు తలొంచుకుని ఏదో చదువుకుంటూ ... చప్పుడు కాకుండా వాకిట్లోనే జోళ్ళువిప్పి మెల్లిగా లోపలికి పోబోతున్న జ్యోతిని, 'ఇప్పుడేనా రావడం?' అన్నాడు ఆనందరావు.

అతని మొఖం చూసీ చూడగానే ఏదో ప్రళయం రాబోతోందని గ్రహించిన జ్యోతి నిలువునా వణికిపోయింది....'చాలా సేపయింది...' అన్నది మెల్లిగా, అబద్ధం చెప్పే అలవాటులేని జ్యోతి.

'మరి యింతదాకా ఎక్కడున్నావ్?'

'పండిట్లో నా స్నేహితురాలు రవణ కన్పించింది...మిమ్మల్నడిగితే మీరు తెలియదన్నారు...వాళ్ళది యీ వూరేట...తనతో బాటు వాళ్ళింటికి వెళ్ళొచ్చాను...' అంది జ్యోతి నెమ్మదిగా...

'ఎవరబ్బా ఆ రవణ!...ఈ వూళ్ళో నాకు తెలియనిది?...' ఆనందరావు ఎరగనట్లే అడిగాడు...'ఆ తిట్టేదో మాటిగా అనెయ్యక ఎందుకీ డొంకతిరుగుడు ప్రశ్నలన్నీ?' అనుకుంది జ్యోతి మనసులో... 'వాళ్ళాయనపేరు వెంకట్రావు. క్రిందటి ఎలక్షన్సులో మీతో పోటీచేసి ఓడిపోయ్యారట...' అంది...

'అయితే తెలిసే వెళ్ళావన్నమాట!...' ఆనందరావు కటువుగా అడిగాడు.

'వెళితే తప్పేముందండి...' ఎంతో నెమ్మదిగా చెప్పాలనుకున్నా జ్యోతి స్వరం కంపిస్తూనే వుంది.

'అయితే—తప్పే లేదన్నమాట!...' మళ్ళీ గద్దించి అడిగాడు ఆనందరావు.

'అతడు మీతో పోటీ చేసినంతమాత్రాన, నేను నా స్నేహితురాలింటికి వెళ్ళగూడదని ఏముందండీ?...'

'అయ్యో! ఎందుకు వెళ్ళకూడదూ!... భర్తకు శత్రువులైనవాళ్ళు భార్యకు మిత్రులవుతారని యింతదాకా నాకు తెలియదులే!' వెటకారంగా అన్నాడు ఆనందరావు.

'నేనన్నది అదికాదు. మీ రాజకీయాలూ, మీ పార్టీలు, ఆ ఎలక్షన్సుదాకా పరిమితం చేసుకోండి...మీకున్న విభేదాలు పంచాయతీ ఆఫీసుల్లోనే అంతం చేసుకోండి. అంతేగాని వాటిని వూరూ వాడా విస్తృతంచేసి కక్షలు పెంచుకోకండి. ముఖ్యంగా రవణా నేనూ ప్రాణస్నేహితులం. స్నేహమనేది యీ పార్టీలకు, కక్షలకూ అతీతమైంది. మాయిద్దరి మధ్య దయచేసి యిలా అడ్డుగోడలు కట్టడానికి ప్రయత్నం చెయ్యకండి.' అంది రుద్ధమైన కంఠంతో అతడికి నచ్చచెప్పాలనే ప్రయత్నంతో... జ్యోతి కళ్ళు నీళ్ళు నింపుకున్నయి...జాలిగా చూసింది భర్తవైపు.

'ఇంత పెద్ద వుపన్యాసం నాకిస్తున్న దానివి ఆవిడనే మనింటికి పిల్చుకురాలేకపోయ్యావా?' మాటి ప్రశ్న వేశాడు ఆనందరావు.

జ్యోతి నిరుత్తరురాలయింది. తన కసలలాంటి అభిప్రాయమే కలుగలేదు. తనే వాళ్ళింటికెందు కెళ్ళాలని, రవణనే తనింటికి తీసుకెళ్దామని అనిపించనేలేదు తనకు ...'పసిపిల్లల్ని యింట్లో వదిలేసి వచ్చింది వాళ్ళు ఏమేడుస్తున్నారో' అని తన ప్రాణం గిజగిజలాడిపోయింది. ఈ పంతాలు మొదటినుంచీ తెలియవు జ్యోతికి.

జ్యోతి జవాబివ్వకపోయ్యేసరికి మళ్ళీ ఆనందరావే అన్నాడు...

'అవును. ఆవిడెందుకు వస్తుంది!... ఆవిడకు భర్తంటే గౌరవం వుంది. అతడి మాట కాదని ఎందుకు వస్తుంది?... భర్తకు గిట్టనివాళ్ళ యింట్లో అడుగు పెట్టడానికీ, విందులు చెయ్యడానికీ, ఆవిడ భర్తంటే లక్ష్యంలేని జ్యోతి కాదుగా!...' అన్నాడు వ్యంగ్యంగా ఆనందరావు.

జ్యోతికి యీ మాటలు కష్టం కలిగించయి...తను నచ్చచెప్పడానికి ప్రయత్నించే కొద్దీ యీయనేమిటి రెచ్చిపోయి మాట్లాడుతారు' అనుకుంది...

'భర్తను గౌరవించడమంటే అర్థం— ఆయన పందంటే పందని, పందంటే

కుందనీ, అలాంటి కాదు...' అంది.

'భర్త చెప్పనపని చెయ్యడం గౌరవించే దానికి చిహ్నమా?...పంచదంటే పంచదడం, చెప్పిన పన్ను చెయ్యడం గౌరవించే పద్ధతు అని నాకు తెలీదులే...'

'గౌరవించడమంటే—తన అభిప్రాయాల్ని, వ్యక్తిత్వాన్ని పూర్తిగా చంపుకుని కాపోవడం అనడమని కాదు...భార్యాభర్తల్లో ఎవరి అభిప్రాయాలు వాళ్ళవి...ఒకరి అభిప్రాయాల్ని ఒకరు మన్నించగలగాలి. లోపముంటే సరిదిద్దుకోమని తెలియజెయ్యాలి. అంతేగాని ఒకరి అభిప్రాయాల్ని ఒకరిమీద బలవంతంగా రుద్దడం కాదు!...నా దృష్టిలో భర్త తప్పు చేస్తున్నప్పుడు తప్పని తెలియ చెయ్యడం భార్య కర్తవ్యమే. అసలు మనం అభిమానించి, గౌరవించేవాళ్ళు తప్పు చేస్తున్నప్పుడే చనువుగా యిది తప్పు సరిదిద్దుకోమని చెప్పగలుగుతారు.'

'అవునవును. నాకు తప్పేదో ఒప్పేదో ఏం తెలుస్తుంది!...నేనేమన్నా బి. ఏ. లు ఎమ్మేలు చదువుకున్నానా? అంతగా నా అభిప్రాయాలు యిష్టంలేనిదానివి, నా పద్ధతులు నచ్చనిదానివీ నన్నెందుకు పెళ్లి చేసుకున్నావ్? అనాడే యిష్టం లేదంటే సరిపొయ్యేదిగా?...తప్పొప్పులు నీకు తెలుస్తాయి! నిన్ను వెంటబెట్టుకు వెళ్లిన నీ స్నేహితురాలికి తెలియాలి!...అంతకంటే ఆ వెంకట్రావుకు తెలియాలి!...అసలయినా నాకు గిట్టనివాళ్ల యింటికి వెళ్ళిన దానివి మళ్లీ నాయింటికి రావడమెందుకు?... నాతో కాపురం చెయ్యటమెందుకు? నీయిష్టంవచ్చినచోటికే వెళ్ళొచ్చుగా? ఎవరు వద్దన్నారు?' అన్నాడు... అతడి కంఠం యిల్లంతా ప్రతిధ్వనిస్తోంది. అప్పుడే పనివాళ్ళూ పాలేర్లూ పోగయి తమాషా చూస్తున్నారు.

జ్యోతికి అతడి ఒక్కోమాట శూలంలా గుచ్చుకుంటోంది. ఇక నిగ్రహించుకోలేకపోయింది....'మీకు ఏమి తెలిసినా ఏమి తెలియకపోయినా అందరి ఎదుటా భార్యను అవమానపర్చడం, మిమ్మల్ని మీరు చులకన చేసుకోడం తెలుసుగా?' ... అని విసురుగా అనేసి మెట్లెక్కబోతోంది జ్యోతి.

'జ్యోతీ!...' యిల్లు దద్దరిల్లింది ఆనందరావు అరుపుతో...క్షణంలో జ్యోతి కోపం కూడా చచ్చిపోయింది... ఒక్కక్షణం మానవత్వం కూడా చచ్చిపోయి! కోపానికి దాసుడైన ఆనందరావు నిప్పులుకక్కే కళ్ల వైపు చూసింది జ్యోతి. ఆవిడ కళ్లల్లో నీళ్లు నిండాయి. కన్నీటిపొరలు కమ్మిన కళ్లతో లోనికి, కదలకుండా మెదలకుండా అలాగే ఒక్కసారి పైనుండి క్రిందిదాకా ఆనంద

# పూర్వాసంధ్యా ప్రవర్తతే...

తాపీగా నిశితంగా చూసి, 'ఇది మిమ్మల్ని ఇద్దర్నీ దూరంచేసే సంఘటన. గుర్తుంచుకోండి' అని తొణక్కుండా బెణక్కుండా అనేసి చరచరా పైకి వెళ్ళిపోయింది జ్యోతి.

మంచంమీద బోర్లాపడి వెక్కివెక్కి ఏడుస్తున్న జ్యోతికి ఆనందరావు మాటలు, అంపం కోత కోసినట్లు బాధిస్తున్నాయి... తను చెయ్యరాని మహాపరాధం ఏంచేసింది? అనరాని మాటలని తన్ను నలుగురి ముందు ఎందుకనవలసివచ్చినట్లు?...అసలు ఆయన్ను పెళ్ళిచేసుకోడానికి ఒప్పుకోడంలోనే తను తప్పుచేసిందా?...ఇక ఎన్నటికీ యిద్దరి మధ్యావున్న యీ అగాధం పూడదా?... భార్య ఎక్కువ చదువుకుంది తను తక్కువ చదువుకున్నాననే 'ఇన్ఫీరియారిటీ' యీయనకు పోనేపోదా...హే భగవాన్!... ఏమిటి తనకు గత్యంతరం?...ఈ యింట్లో మట్టి ముద్దలా, మైనపుబొమ్మలా ఆతడి చేతిలో కీలుబొమ్మలా బ్రతకవలసిందేనా?...' అని ఆలోచిస్తూ పడుకున్న జ్యోతికి ఆనందరావు అన్నమాటలు, 'ఇక నా యింటికి రావటమెందుకు?' చెవుల్లో మారుమ్రోగాయి...ఛీ! ఇలాంటి మాటలుపడి యీ యింట్లోవుండడం అనవసరం అనే నిర్ణయానికి వచ్చింది జ్యోతి...

అలా ఆలోచిస్తూపడుకున్న జ్యోతికి ఎప్పుడో కళ్ళుమూసే వేళప్పుడు నిద్రపట్టి, సూర్యకిరణాలు చురుక్కున తాకే దాకా మెలకువరాలేదు. క్రిందికి దిగివచ్చేసరికి ఆనందరావు ఎక్కడికో వెళ్ళిపోయాడని తెలిసింది. పనివాళ్ళూ, పాలేర్లు తన్ను చూసి నవ్వుతున్నట్లు అనిపించి వాళ్ళ ముందు తలెత్తుకు తిరగడానికి కష్టంవేసింది...ఇంట్లో రంగడు కూడా లేడు...కాఫీకూడా తాగకుండా, చేతిసంచిలో రెండుచీరలు సర్దుకుని 'మా అమ్మను చూడాలనివుంది.' అని మాత్రం వర్దమ్మగారితో చెప్పి బయలుదేరింది జ్యోతి; అవమానంతో కుతకుతలాడిపోతున్న మనసుతో.

వాడినముఖం, పీక్కుపోయిన కళ్ళు, చేతిసంచితో రిక్షాదిగిన జ్యోతిని చూసి, 'ఒంటిగా వచ్చావేమ్మా?...అంది జానికమ్మగారు.

అసలే గాయపడిన మనసులోవున్న జ్యోతి మనస్సు చివుక్కుమన్నది. 'ఏంరాకూడదా అమ్మా?' అన్నది.

'రాకూడదనా!...ఒంటిగా వస్తున్నప్పుడు ఓ కార్డుముక్క వ్రాస్తే వేణువచ్చి తీసుకొచ్చేవాడు కదా అని కానీ?...'

జ్యోతి మాట్లాడలేదు. కూతురు ముఖంచూసి ఆవిడకు ఏమనుమానం కలిగిందో కానీ యింకేమీ అడక్కుండావెళ్ళి కాఫీపెట్టి పట్టుకొచ్చియిచ్చింది. జ్యోతి వచ్చిందన్నమాటేగానీ మనసు మనసులో లేదు. ఏదో ఆలోచిస్తూ ఎక్కడో చూస్తూ వుండేది. జ్యోతివచ్చిందంటే కళకళ్ళాడుతూ వుండాల్సిన యిల్లు చిన్నబోతూనే వుంది. తమ్ముడితోగూడా ఎక్కువ మాట్లాడలేదు. అంతకూ జానికమ్మగారు వుండబట్టలేక అడిగేసింది. 'ఏమ్మా! అల్లుడూ, నువ్వూ మాటామాటా అనుకోలేదుగదా. ఒక్కతివే వచ్చావ్?' అని.

'అబ్బే!...అదేంలేదమ్మా...ఆయన ఏదో పనిమీద పదిరోజులు వూళ్ళో వుండనన్నారు. అక్కడ ఒక్కతినీ వుండలేక వచ్చానమ్మా...' అని బదులు చెప్పింది జ్యోతి... ఆ వెంటనే పక్కకు తిరిగి కంట్లో నలుసు పడ్డట్టు కళ్ళద్దుకోటం కూడా ఆవిడ చూచిందని జ్యోతికి తెలియదు ... అయితే నాలుగురోజులు పోయ్యాక అడగొచ్చు, యిప్పుడు మరీ బాధపెట్టడమెందుకు అనుకొని మళ్ళీ అడగలేదు....జ్యోతి తన ఆవేదన తల్లితో చెప్పలేక, దాన్ని గుండెల్లో దాచుకుని బాధపడుతోంది....అసలు ఒక్కోసారి ఆయన ఎందుకలా ప్రవర్తిస్తారు?... అనేది ఎంత ఆలోచించినా తట్టలేదు జ్యోతికి. అయితే యిప్పుడేం చెయ్యాలి?... ఏదన్నా వుద్యోగం చూచుకోనా? ... లేక నాలుగురోజులు ఓపికపట్టనా?... అని ఆలోచించింది.

* * *

'రామ్మా!...జ్యోతి!... రా... ఎప్పుడు రావడం?' అంటూ పల్కరించింది పార్వతి జ్యోతిని.

నాలుగురోజులు గడిచి మనసు కాస్త కుదుటబడ్డాక పార్వతిని చూసిరావాలని బయలుదేరింది జ్యోతి. రఘుబాబు పోయ్యాడని విన్నప్పటినుంచీ పార్వతిని వెళ్ళి పలుకరించాలని అనుకుంటూనేవుంది. ఒకరోజు కాస్త ఓపికతెచ్చుకుని బయలుదేరిందేగాని, 'తను చూడగానే పార్వతి గుండెలు బద్దలయ్యేలా ఏడిస్తే ఏమని ఓదార్చగలదు తను' అనుకుంటూవచ్చింది...కానీ పార్వతి మామూలుగా పల్కరించడంచూసి ఆశ్చర్యపోయింది జ్యోతి...

కానీ బాబులేని ఆయిల్లు బోసిపోయినట్లువుంది. పార్వతి ముఖం చూడగానే జ్యోతికి దుఃఖం ఆగలేదు. కళ్ళనిండా నీళ్ళు పెట్టుకున్న జ్యోతితో, 'ఋణానుబంధం



అవున్నా!...అయిపోయింది...అప్పుతీరిపోయింది, వెళ్ళిపోయ్యాడు ... బాధపడి ఏం ప్రయోజనం?' అని వేదాంతిలా చెబుతున్న పార్వతిని చూచి 'యీవిడకెంత గుండెనిబ్బరం!' అనుకుంది జ్యోతి. మొదటంతా వేదాంతం చెప్పి తీరా తమదాకా వచ్చేసరికి గగ్గోలు పెట్టేవాళ్లను చాలామందిని చూసింది జ్యోతి. కాని పార్వతిలా ఆరనిచిచ్చును కడుపులో దాచుకుని యింత నిర్వికారంగా కన్పించేవాళ్లను చూడ్డం యిదే ప్రథమం.

'ఇంతకూ ఒంటిగానా ? జంటగానా రావడం?' టాపిక్ మారుస్తూ అడిగింది పార్వతి.

'ఒంటిగానే...'

'ఏమిటి మీ వూరి విశేషాలు ?'

'ఏమున్నయి ? ... అంతా మామూలే... మీరే చెప్పాలి విశేషాలు.' అంది జ్యోతి.

'నన్నే చెప్పమంటావా?...ఆఁ అన్నట్లు మర్చిపోయ్యాను. నేను ప్రైవేటుగా ఇంటరు పరీక్షకు చదువుతున్నాను.'

'నిజమా అక్కయ్యగారూ ? ... నిజంగానా!!...' సంతోష సంభ్రమాలు ముప్పిరిగొనగా అడిగింది జ్యోతి.

'నిజమేనమ్మా...'

'అయితే అక్కయ్యగారూ...దీనికి నిజంగా అభినందించాల్సింది మిమ్మల్నికాదు ... మా మేష్టార్ని అభినందించాలి ... ఆయన ఉదాత్త హృదయాన్ని అభినందించాలి అక్కయ్యగారూ!...' అంది జ్యోతి.

'నువ్వన్నదీ నిజమేనమ్మా జ్యోతి !...మా ఆయన్నుగురించి గొప్పగా చెప్పుకోడం కాదుగాని, అంత వుదాత్తహృదయులుండడం అరుదే ... కానీ—ఆయనమాత్రం ఓవట్టాన వొప్పుకున్నారనుకున్నావా?...ఎంత ఆర్భాటం చేశారని!...' అంది పార్వతి నవ్వుతూ...

'అసలు అక్కయ్యగారూ!...మీకు చదువుమీద ధ్యాసెలా కలిగిందిప్పుడు?' అని అడిగింది జ్యోతి కుతూహలంతో...పార్వతి పెళ్ళికి ముందే ఎస్సెల్సీ పాసయిందని తెల్సు జ్యోతికి.

'ఒకరోజు బజారులో నా చిన్నప్పటి స్నేహితురాలు కన్పించింది జ్యోతీ!...మాటల సందర్భంలో తను ప్రైవేటుగా చదివి యింటర్మీడియెట్ పాసయ్యానని బి. ఎ. చదువుతున్నానని చెప్పింది. దాన్ని చూడగానే నేనూ చదువుకుంటే బాగుండునని పించింది. ఇంతమందికి విద్యగరిపే యీయన నా చదువుకు అభ్యంతరం చెబుతారా అనే ధైర్యంతో వాళ్ల యింటికివెళ్ళి 'యింటర్' పుస్తకాలు తెచ్చుకున్నాను ... ఆరాత్రి ఆ పుస్తకాలు ఆయనకు చూపగానే, 'ఎందుకివి? ఏంచేసుకుంటావ్?' అని అడిగారు.

'నా స్నేహితురాలు శారద యిచ్చింది. నేనూ స్వంతంగా చదివి పరీక్షకు వెళ్దామనుకుంటున్నాను.' అన్నాను.

'ఇప్పుడు వున్నట్టుండి చదువుకోవాలని ఎందుకనిపించింది నీకు?'

'ఊరికేనే...డిగ్రీకోసం.'

'ఇదివరకు నీ డిగ్రీలుచూసే పెళ్లిచేసుకున్నానా? ఇకముందు డిగ్రీ లేకపోతే నిన్ను కాదన్నానా? ఇప్పుడు డిగ్రీ అవసరం ఏమొచ్చింది పారూ?' అన్నారాయన...ఆయనలా అంటుంటే నాకు కష్టం వేసింది జ్యోతీ!...

'వీళ్ళింతమందికి విద్య బోధిస్తున్నారు. ఆసక్తిలేని వాళ్లకుకూడా ఆసక్తి కలిగిస్తున్నారు. సరస్వతీ ఆరాధకులు మీరు. సరస్వతీ నిలయంలాంటి యీ యింట్లో నేను చదువుకోడానికి మాత్రం అవకాశం లేదన్నమాట!' అన్నాను బాధపడుతూ.

'అవును నిజమే పారూ!... అంతమందికీ చదువుచెప్పి యింటికివస్తే నీనుండి ఆశించేదేమిటి పారూ నేను?...నీ అనురాగం. ఆదరణ...అంతే కానీ—యింటికిరాగానే నువు కూడా 'దీని అర్థం ఏంటో చెప్పండి.' అంటూ నిలేస్తే యిక నాకెని వీలా వుంటుందో ఆలోచించు. నవ్వుతూ ఎదురు వస్తావని నేను పరుగులమీద యిల్లు చేరుకుంటే నువు పుస్తకాలు ముందేసుకు కూర్చుని వచ్చిరాని యింగ్లీషుతో కుస్తీ పడుతుంటే చూడ్డానికి ఎంత కష్టంగా వుంటుందో ఆలోచించు...అదేనా. నేను భార్యనుండి ఆశించేది చెప్పు పార్వతీ!' అన్నారు.

'విద్య విజ్ఞానంతోబాటు వినయాన్నిస్తుందని మీరే అన్నారు. విద్య ఎవరి బాధ్యతలు వాళ్ళు గ్రహించేలా చేస్తుందనీ మీరే అన్నారు. మరి నేను చదువు మొదలెట్టగానే నా బాధ్యతలన్నిటినీ మర్చిపోతానని ఎందుకనుకుంటున్నారో నా కర్థం కావటంలేదు ...' అని మాట్లాడకుండా పడుకున్నాను.

మర్నాడు మధ్యాహ్నం భోజనాలు పూర్తయ్యాక పుస్తకాలన్నీ తెచ్చి మళ్లీ కట్ట కడుతున్నాను.

'ఎందుకు కట్ట కడుతున్నావ్ పుస్తకాలు ?' అని అడిగారు.

'మీరు చదవద్దన్నారుగా...దాని పుస్తకాలు దానికిచ్చేసి వస్తాను.' అన్నాను.

'తెచ్చిన వాటిని యిచ్చెయ్యటమెందుకు? ఉండనీ...' అన్నారు.

'వృథాగా మనదగ్గరవుండే బదులు యింకోరైనా చదువుకుంటారు.'

'పోనీ – నువ్వే చదువుకోవచ్చు. వుండనీ.'



# పూర్వాసంధ్యా ప్రవర్తతే...

అన్నారు:

'ఆఁ!...ఏమన్నారు!...' అన్నాను నా చెవుల్ని నమ్మలేక.

'చదువుకో పార్వతీ ! ... అసలు తీరిక సమయంలో ఏ కబుర్లో చెప్పుకుంటూ కాలం గడపాలని ఆశిస్తారు అంతా ... అటు వంటిది నీకానమయం ఓమంచిపనికి వుప యోగించాలనిపించడమే ఓ విశేషం. అందు లోనూ విద్య నభ్యసించాలనిపించడం మరీ మెచ్చుకోతగ్గ విషయం. విద్యాతృష్ణ అనేది ఒకళ్ళు చెబితే కలిగేదికాదు, ఒకళ్ళ వద్దన గానే తీరేదీకాదు. భర్త చేసే మంచిపనులను భార్య సమర్థించాలన్నట్లే, భార్యకు కల్గిన సదాశయాలకు కార్యరూప మివ్వడానికి భర్త తోడ్పడితేమాత్రం తప్పేముంది!...చదువుకో పార్వతీ ఫర్వాలేదు చదువుకో' అన్నారాయన.

'అనగానే సరికాదు. బాగా ఆలోచించుకుని మరీ చెప్పండి. మొదలుపెట్టినట్లు కాదు. కాలుగేళ్ళు శ్రమపడాలి. తీరా మధ్యలో మానెయ్యమంటే...'

'లేదులే సారూ!...రాత్రంతా బాగా ఆలో చించుకునే చెబుతున్నాను. రాత్రి ఏవో వూహించుకొని భయపడ్డానుగానీ, ఆ భయాలు నిజాలు కాకుండా చెయ్యాల్సిన బాధ్యత నీది...అసలు శూన్యమైన యీ యింట్లో పాతు జ్ఞాపకాలు మర్చిపోవాలంటే నీకు తప్పక ఓ వ్యాపకం వుండాలి. తప్పక చదువు' అన్నారు ... అప్పటినుంచీ చదువుతున్నాను. వచ్చే సెప్టెంబరుకు వెళ్ళాలని ప్రయత్నం. తెలియనివి ఎప్పుడన్నా ఆయనే అడిగి చెబు తుంటారు. మధ్యాహ్నం భోజనాలయ్యాక కూర్చొని చదువుకుంటాను...'అని పార్వతి చెప్పిందంతా ఆసక్తితో విన్న జ్యోతి ఆలోచనలు పరిపరివిధాల పోతున్నయి...ఇంత వుదాత్తంగా కన్పించే మేష్టారే మొదట్లో ఆవిడమాటల్ని పెడచెవిని పెట్టారు... ఆయన వద్దనగానే పార్వతి ఓపికపట్టింది. మొదట వొద్దన్న మేష్టారే మర్నాడు తనకు తాను 'సరే' నన్నారు ... అంతా చిత్రంగా తనకేదో కొత్త పాఠం నేర్పుతున్నట్లుగావుంది జ్యోతికి...

పార్వతిదగ్గర సెలవుతీసుకు వచ్చేస్తుంటే వహాన్ కన్పించాడు ... జ్యోతినిచూసి ఒక చిన్ననవ్వు నవ్వి వెళ్లిపొయ్యాడు... ఆ నవ్వు తనమా తన నిర్ణయాలను వెక్కిరిస్తున్న ట్లుగా తోచింది జ్యోతికి...తన నిర్ణయాలు అంత చంచలమైనవా ? తన మనసు అంత బలహీనమైందా ? అని ఆత్మ విమర్శ చేసు కుంది జ్యోతి ... తను ఆనందరావు బల హీనతలను క్షమించగలననే ధీమాతోనే అమ్మ ఏర్పాటుచెయ్యబోతున్న వహాన్‌తో పెళ్లిని కూడా వద్దని ఆనందరావును చేసుకుంది... కానీ ఆయన ఆవేశం, తొందరపాటూ తొలు నుంచీ కూడా ఆయన బలహీనతను కూడా క్షమించలేక వచ్చేసింది తను ... పార్వతిలా తనూ కొంచెం ఓర్పు వహించాల్సింది!...

ఆనందరావు తన్ను ప్రాణాధికంగా ప్రేమిస్తున్నాడనడంలో సందేహం ఏంలేదు జ్యోతికి...ఒక్కోసారి ఆయన ప్రేమకు తను అర్హురాలనేనా అని కూడా అనిపించేది. అటు వంటి ఆయన్ను తను వదిలివచ్చేస్తే అక్కడ నలుగురూ ఏమనుకుంటున్నారో? ... అసలు తన పిచ్చిగానీ—అనూచానంగా వస్తున్న అభి ప్రాయాల్ని, ఏళ్లతరబడిగా పాతుకుపోయిన భావాల్ని, తను తిరిగి వచ్చేసినంతమాత్రాన మార్చగలదా ? ... ప్రపంచంలో పోర్టీలు కక్షలూ,ఈర్ష్యలు,ద్వేషాలుమాత్రం కాకుండా ప్రేమ, స్నేహమూ, దయ క్షమలాంటివి కూడావున్నాయని, కక్షలూ, కార్పణ్యాలతో సాధించలేని వానినిగూడా ప్రేమతో, స్నేహంతో సాధించగలమనీ ఆయనకు నెమ్మదిగా నచ్చ చెప్పాలి...ఈ తన సంకల్పం నెరవేరడానికి చాలారోజులు కృషిచెయ్యాల్సి వుంటుంది ... అయినా తను ప్రయత్నం చెయ్యాలి...అనుకుంది జ్యోతి...

మర్నాడే తను వూరికి బయలుదేరింది జ్యోతి...కానీ జ్యోతికి భయంగానేవుంది మళ్లీ ఏమంటాడో, ఏమి రభస జరుగు తుందోనని...ఇంట్లోకి రాగానేవచ్చి కాళ్లకు పెనవేసుకున్న రంగడ్ని, 'మీ అన్నయ్య యింట్లోలేరా?' అని అడిగింది.

'లేదు వదినా. పొద్దున్నే వెళితే మళ్లీ రాత్రి ఎప్పుడోవస్తాడు. మవులేందే నాకేం తోచటంలేదు వదినా.. అవలెక్కడికివెళ్లావ్?' దిక్కుమొగంతో అడుగుతున్న రంగడ్నిచూస్తే జాలేసింది జ్యోతికి...'తమ కీచులాటలమధ్య పాపం వీడు నలిగిపోతున్నాడు అనుకుని తను తెచ్చిన 'బిస్కట్‌పాకెట్' వాడిచేతికిచ్చి దగ్గర కూచోపెట్టుకుంది...'మాఅమ్మను కూడా లేపిపోస్తే నేను వెళ్లానుగానీ...మీ అన్నయ్యకు ఎప్పుడన్నా నేను జ్ఞాపకం వచ్చానా?' అని అడిగింది వాడి తల నిమురుతూ.

'ఓ! రోజూ అడిగేవాడు వదినా?... ఇంటికి రాగానే నన్ను పిల్చి 'మీ వదిన వచ్చిందా?' అని అడిగేవాడు...'అని రంగడు చెప్పాక అప్పటికి కొస్త ధైర్యంవచ్చింది జ్యోతికి.

ఆరోజు రాత్రి బాగా పొద్దుపొయ్యాక ఆనందరావు యిల్లు చేరుకున్నాడు. హాల్లో జ్యోతి కనిపించినా పలుకరించకుండా సరా సరి మేడమీదకు వెళ్లిపొయ్యాడు. జ్యోతి రంగడ్నిపిల్చి 'వదిన భోజనానికి నీకోసం కని పెట్టుకువుంద'ని చెప్పమని చెప్పి పంపిం చింది. రంగడు తిరిగొచ్చి 'అన్నయ్య భోజనంచేసేవచ్చాట్ట.' అని చెప్పాడు.

జ్యోతి తన భోజనం ముగించుకొని పైకి వెళ్లింది...

చీకటి వెలుగులకు సంధిచేస్తున్నట్లుగా, దివిని భువిని తన వెన్నెల వెండిధారాలతో కలుపుతోంది వెన్నెల. వేపచెట్ల చల్లనిగాలి మందమందంగా వీచి ప్రాణాలకు హాయి గొల్పుతోంది. మెల్లగా అడుగులో అడుగేసు కుంటూ, చప్పుడుకాకుండా పైకొచ్చింది జ్యోతి. కానీ ఆమె తలలో విచ్చిన మల్లె పూలవాసన గుప్పుమని గుబాళించి, ఆమె రాకను ఆనందరావుకు పట్టించేసింది. అంతదాకా చంద్రుడ్ని చూస్తూ పడుకున్న ఆనందరావు చప్పున కళ్లు మూసుకుని నిద్ర నటిస్తూ పడుకున్నాడు...

జ్యోతి దగ్గరగావచ్చి, 'ఇదిగోండి. పాలు.' అంది.

ఆనందరావు పలుకలేదు.

'అబ్బో! గాఢ నిద్రలోవున్నట్లున్నారు!...' పెద్దగా అని గ్లాసు మంచం పక్కనపెట్టి తిరిగి వెళ్లిపోబోయింది జ్యోతి ... అతడిది దొంగ నిద్రని తెలుసు. అయినా అంత బెట్టులో ఆయనుంటే తనే ఎందుకు లోకువ అవాలనిపించింది...అందుకనే తిరిగి వెళ్లిపోబోతోంది...ఆనందరావు కళ్లు సగం తెరిచి చూశాడు...ఇంకెక్కువ బెట్టుచేస్తే అవకాశం చేజారిపోతుందనుకొని, చేతికందిన జ్యోతి జడను పట్టుకొని దగ్గరకు లాక్కున్నాడు.

'అబ్బ! వొదలండీ... పాపం నిద్రపోతు

న్నారుగానే...' అంది ఎత్తిపొడుపుగా జ్యోతి.

'ఎలాగూ నిద్రాభంగం కలిగించావు?... అవునోయ్ పిల్లా! చెప్పకుండా వెళ్ళిన దానివి ఎవరి నడిగివచ్చావ్?' అని అడిగాడు ఆనందరావు జడ వదలకుండానే...

'చెప్పకుండా వెళ్ళాను కాబట్టే అడక్కుండావచ్చాను. నా యింటికి నేను రావడానికి ఒకళ్ళ పర్మిషన్ కావాలేమిటి? నా భర్త దగ్గరకు నేను రావడానికి యింకోళ్ళను అడగాలా?...' అంది నవ్వుతూ జ్యోతి.

ఆనందరావుకు ఏం జవాబుచెప్పాలో తోచలేదు నిజానికి జ్యోతి 'నా భర్త, హాయిల్లు' అంటూ మాట్లాడ్డం ఆనందరావుకు ఆనందమే కలిగించింది. పైకి మాత్రం బెట్టుగా, 'ఊఁ!' అన్నాడు.

'అసలు మా మామయ్య ఓ తప్పుపని చేశాడు...' ఆనందరావు మంచి 'మూడ్'లో వున్నాడని కనిపెట్టిన జ్యోతి పరిహాసంగా అంది.

'ఇంతకాలానికి ఆ కోడలు పిల్లకని పెట్టిన ఆ తప్పు ఏమిటబ్బా?...' అన్నాడు వచ్చేనవ్వు నాపుకుంటూ.

'మీ పేరు ఏదూర్వాసరావనో పెట్టుంటే చాలా బాగుండేది...' అని నవ్వుతూ, వెళ్ళి మంచంమీద కూచుంది. నిజానికి ఆ మాట ఆనందరావుకు చాలాకోపం తెప్పించింది. కాని యిప్పుడతడి మనస్సు ఆ 'మూడ్'లోలేదు. అసలు ఆనందరావుకు కోపం వచ్చినప్పుడు ఒళ్ళు తెలియదు. ఆ తర్వాత వెంటనే కోపం తగ్గిపోతుంది... దానికితోడు వెన్నెల చల్లదనం అతడి కోపాన్ని పూర్తిగా చల్లబరిచింది. అతడు జ్యోతిని దగ్గరకు లాక్కుంటూ...

'నే నేమన్నా అంటే అన్నానని బాధపడతావుగానీ, ఎందుకన్నానో అర్థంచేసుకోవేం జ్యోతీ!...నువ్వు నీ స్నేహితురాలింటికి వెళ్ళావనికాదు నా బాధ. నాతో విరోధం పెంచుకున్న వాళ్ళ యింటికి వెళ్ళినందుకు మనం ఎంత చులకనైపోయామో నీకు తెలియదు. ఇక్కడి ప్రజల మనస్తత్వం నీకింకా అంతుబట్టలేదు జ్యోతీ!...' అన్నాడు ఆనందరావు.

జ్యోతి ఏ జవాబు చెప్పలేదు. ఏమంటే ఏంవస్తుందోనని మాట్లాడకుండా వూరుకుంది. జ్యోతి ఎదురు జవాబు చెప్పకుండా బుద్ధిగా వింటున్నందుకు ఆనందరావు సంతోషించాడు...మళ్ళీ అన్నాడు ఆనందరావు... 'నువ్వారోజు వాళ్ళయింటికి వెళ్ళినందుకు వాళ్ళు ఎన్ని కల్పించి ప్రచారం చేశారో నీకు తెలుసా? ... వాళ్ళింట్లో భోజనంచేశావని, వెంకట్రావుతో మాట్లాడావని చిలవలు పలవలు అల్లి ఎంత ప్రచారం సాగించారో నీకేం తెలుసు? మనిద్దరి మధ్యా మనస్పర్థలున్నయ్యని, నా మాటంటే నీకు బొత్తిగా లక్ష్యంలేదని అందుకనే నామాట లెక్కపెట్టకుండా వాళ్ళింటికి వెళ్ళావని, లోకువకట్టి చెప్పుకుంటున్నారు వూళ్ళో... కొంతమందైతే మొహాన్నే, 'ఏమయ్యోయి! నీ పెళ్ళాం వాళ్ళింటికి వెళ్ళిందిటగా?!...' అని అడుగుతున్నారు. అనవసరంగా యింత రభస ఎందుకు చెప్పు? మనం సహృదయంతో చేసినా దాన్ని అర్థంచేసుకోగల మానసిక పరిణతి ప్రజల్లో వుందో లేదో ముందు ఆలోచించుకోవద్దా జ్యోతీ!...'

ఆనందరావు చెబుతున్నదంతా బుద్ధిమంతురాల్లా వింటున్న జ్యోతి, ముందే ఓ నిశ్చయానికి వచ్చింది...అతడి మాటలకు ఎదురు జవాబులు చెప్పకుండా మౌనంగానే మార్పు తేవాలని ... అందుకే అతడి గుండెలమీద వాలిపోతూ.

'ఇకనుండీ...మీ కిష్టంలేని పనులెప్పుడూ చెయ్యనుగా...' అంది గోముగా.

'నాకు తెలుసు. నా జ్యోతిచాలామంచిది...' చెదిరిన ముంగురులు సవరిస్తూ ప్రేమగా చూశాడు జ్యోతి కళ్ళలోకి...

(ఇంకా వుంది)

అల్లాటప్పయ్య






కాశీరత్నం నవ్వుతాడు ఏంచూసినా — ఏడవడం మరచిపోయి ఎంతోకాలం అయినట్టు —

అతని వయసునిబట్టి అనుభవాన్నిగాని, అనుభవాన్నిబట్టి వయసునిగాని, కొలవెయ్యడం అవివేకమే అనిపిస్తుంది నాకు మట్టుకు —

తమమీద తమకి విశ్వాసం, తమ ఉనికిమీద తమకి సంతృప్తి లేనివాళ్లని చూసి, పెదవులుకదిపి, నీరు ఎండిన కళ్లతో నవ్వుతాడు.

గాజులు చప్పుడైతే, కాశీరత్నం చదివే చదివే పేపరు పక్కనపడేసి, భార్యని చూస్తాడు తలెత్తి — సాయంకాలపు సహజమైన నీరసంతో —

అతనిభార్య, మంచినీళ్లుతెచ్చి పక్కపెడుతుంది — ఇనపవాసనవేసే, వెచ్చని, 'పైపు' నీళ్లు —

కాశీరత్నం భార్య నవ్వదు — అతనే నవ్వద్దని కోరాడు ప్రత్యేకంగా — అందుకే ఆమె నవ్వదు.

కాశీరత్నానికి భయం, భార్యజబ్బు నవ్వు చూడ్డం —

విలాసంగా కదిలి, — 'ఎందుకు నవ్వద్దన్నారూ? బాగా నవ్వలేవా!' అని గారం చేసేంత నాగరికతా, రొమాన్సూ, అతని భార్యలోలేవు,

ఈ అభిప్రాయం, చూసేవాళ్లకి తోచే ఒక అంశంమాత్రం —

కాశీరత్నానికి అభిప్రాయాల బాధకంటే నఆకలిబాధ ఎక్కువ,

అతను ప్రతి చిన్నవిషయాన్ని గురించి ఆలోచించే ఓపిక లేక, చికాగ్గా నవ్వుతాడు. అతను మామూలుగా బతికేస్తున్నాడు.

* * *

ఒకరోజు —

అత్తగారు, ఖంగుమని ఇల్లు ప్రతిధ్వనించేలాగ పిల్చింది కోడల్ని —

ఖంయ్‌మని ఏడుస్తూ చిన్నమరిది కాలికి చుట్టుకున్నాడు.

బొగ్గుల కుంపటిమీద అన్నపుగిన్నెమీదీ మూత ఎగిరిపడుతోంది.

గాలికి నిప్పురవ్వలు చెదురుతున్నాయి.

'ఆఁ — వస్తున్నా —' అంటూ, వచ్చే పొడిదగ్గుని పైటకొంగుతో ఆపుకుంటూ,

— గుండెల్లో ఏర్పడుతున్న ఒకబాధాతరంగాన్ని అణిచిపెడుతూ, కాలికి చుట్టుకున్న మరిదివి బుజాన వేసుకుని, లోపలికి వెళ్ళింది.

కాశీరత్నం ఇదంతా చూస్తున్నాడు— నిర్లిప్తమైన నవ్వు తడితడి పెదాలవెనక మణిగిపోయింది.

మరీ నాగరికుల మనుకునే వాళ్ళు కొందరు కాశీరత్నాన్ని వెకిలిమనిషంటారు. 'అస్తమానం అయినదానికీ, కానిదానికీ, అలా కులికిపోతోన్నట్టు నవ్వుతాడెందుకు, త్రాష్టంలాగ!—' అని.

అతనితల్లే అంటుందీమాట తరుచుగా— తన భర్త 'ఆస్తి'ధ్వంసం చెయ్యకుండా తను కాపరానికొచ్చి తొలిరోజుల భాగ్యాన్ని జ్ఞాపకం చేసుకుంటూ—

కాశీరత్నం అమ్మతిట్లు తిట్టినా మాట్లాడడు—

భయంకాదు—భక్తికాదు — అమ్మంటే జాలేస్తుందతనికి—నవ్వొస్తుంది కూడా—

ఆ సాయంకాలం,

అత్తగారు కోడల్ని కేకేసి, కొన్ని సూచనలూ, తిట్లూ, సరాఫరాసేవేళ.—

పేపరుపక్కన పడేసి, బయటికి పోదామని బయలుదేరాడు కాశీరత్నం—

తల్లి పెరటివైపునించి వచ్చి, 'ఎక్కడికి?' అంది.

'ఆఫీసులో డిన్నరుంది—వెళ్ళాలి.'

'ఉంటే!'

'వెళ్ళాలి'

'తమ్ముణ్ణి కూడా తీసికెళ్ళు'

'వాణ్ణా'

'ఆఁ— వాణ్ణే—ఏవిటి అభ్యంతరం!'

'అక్కడికి మహా ఆఫీసర్లూ వాళ్ళూ వస్తారు. బాగుండదేమో!'

'నిక్షేపంలా ఉంటుంది — ఇప్పుడే వెళ్ళాలా!'

'కాదు ఎనిమిదింటికి — అందాకా క్లబ్బుకి వెళ్తున్నా—'

'క్లబ్బుకా!—సామాన్లు తేవాలి.'

'తెమ్మను —తమ్ముడున్నాడుగా!'

'వాడిప్పటిదాకా తిరిగొచ్చాడు—నువ్వెళ్ళిరా —వాడింటిపట్టునుంటాడు.'

కాశీరత్నం తల్లికేసిచూసి ఊరుకున్నాడు.

'సరేమరి, దాన్ని సంచీతెమ్మను. పెందరాళే వెళ్ళాలి మళ్ళీ.'

'రాత్రి తమ్ముణ్ణి తీసికెడతావామరి!'

'పిలుపడదేమో!'

'అయితే ఓపనిచెయ్యి!'

'ఏవిటి?'

'నువ్వూ వెళ్ళకు!'

కాశీరత్నం తెల్లబోలేదు.

'అదేం!' అని మాత్రం అన్నాడు.

'అది బియ్యంపోసింది—ఆ అన్నం అంతా బయట పారబొయ్యాల—ముందు చెప్పుకోవద్దూ! ఏం—అర్థమైందా! — ఓమాటలా తిరిగొస్తే తిరిగిరా. దీపాలు పెట్టేవేళకి ఇంటిపట్టునుండాలి సుమా! — నేను సహించను!'

'సరేలేవే బాబూ — వెళ్ళనులే—సరా!— నీ కోడలుందా అక్కడ—'

'ఆఁ—ఏవిటా రాచకార్యం — ఏదో పని చేస్తోంది—నాతోచెప్పు.'

'ఏంలేదులే—' అన్నాడు కాశీరత్నం సందేహిస్తూ—

'ఏవో రహస్యాలుగాబోలు – మాయసంత— తరవాత చెప్పొచ్చులే—'

'నీకు తెలియని రహస్యాలేం ఉంటాయమ్మా!'

'అమ్మ!—గౌరవం మండిపోతోంది. నీపని చూసుకోవెళ్ళు—అందలా లెక్కించక్కర్లేదు అడుక్కుతినమని వదిలెయ్యకపోతేచాలు.'

జారే జారే జుట్టు ముడి—

చాలీ చాలకుండా ఒంటిని సగం సగంగా కప్పే చీరగుడ్డ — ఇదో ప్రత్యేకమైన వితంతురూపం.

బైట, పెరటివైపు తలుపు చాటునుంచి, యీ గొడవ విని, అతని భార్య కటకట పడింది.

పెరటివైపు వచ్చే కాశీరత్నం తల్లికి, కోడలు కనిపించింది — సాభిప్రాయంగా — 'మా యిళ్ళల్లో సొమ్ము నిలవడం మామూళ్ళు లేవు—జబ్బులూ, మందులూను, రంగరాజుగారబ్బాయిని చూస్తే ముచ్చటేస్తుంది—పట్టుమని పాతికేళ్ళు లేవు— అప్పుడే ఏమ్మే—పెళ్ళాం బంగారుబొమ్మ!— పులి గడిగిన ముత్యాల్లా ఉంటారు—మనం ఉన్నాం ఎందుకు?—ఓ ఎదుగా—పొదుగా...'

కోసేస్తోన్నట్టుగా సాధిస్తోంటే, కాశీరత్నం భార్యకి, ఒళ్ళు ఉడికిపోయి, సమాధానం చెప్పింది—

'మనం ఎవళ్ళం లేకపోతే, ఆయనా చదువుకుని సుఖపడుదురు!' అనేసింది.

'ఆఁ—యఁ—న్నేఁ..అదృష్టం మండిపోయి... నీకు వాడూ, వాడికి నువ్వూ...'

'మా ఇద్దరికీ మీరూ...'

కాశీరత్నం తల్లి, యీ అవమానం భరించలేక, రాగాలెట్టడం మొదలెట్టింది.

ఈ ఘోర దురంత సంగ్రామం చూసి, కాశీరత్నానికి తల బద్దలయ్యేలాగా ఉంది.

కాశీరత్నానికి, తల్లిమీదా, భార్యమీదా కూడా జాలివేసింది.

ఇద్దరూ తనమీద 'జాలి' చూపిస్తూ కాట్లాడుకుంటూంటే నవ్వొచ్చింది—

నలభయ్యేళ్ళ అమ్మ, ఇరవైమూడేళ్ళకే సంసారయాత్రలో పెళ్ళితో ముడిపడ్డ బాధ్యతల బరువులతో కాశీరత్నం—

కారణమేమో తెలియకుండా తల్లి ప్రదర్శించే కోపాన్ని తప్పుకోవడానికి అలవాటుపడ్డా, అప్పుడప్పుడు అతనిలో ఏదో ఉద్ధృతమైనశక్తి లేవబోయి, తల్లిమీద జాలితో అణిగిపోతుంది.

కాశీరత్నం భార్యకి, అర్థందొరకని గుండె జబ్బు—ఆమె ఆవేశపడితే చాలు, అది ఆమె నొక్కుర్తినేకాక, ఇంటిల్లిపాదినీ కలత పెడుతుంది.

ఇటు ఆశలు చచ్చిన అమ్మ, అటు జబ్బుతో. సున్నితమైన పలకరింతకోరే భార్యా, కాశీరత్నంలో మంచితనాన్ని పరీక్షిస్తూనే ఉంటారు,

* * *

మరొకరోజు—

సాయంకాలం—

క్రిందటేడు సరిగ్గా ఇట్లాంటి సాయంకాలమే అందరితోపాటూ కాశీరత్నంకూడా ఏడిచాడు. ఇవాళ మళ్ళీ ఎవళ్ళో రావడంతో అంతా ఏడుస్తున్నారు కాశీరత్నం ఆఫీసు నించి ఇంటికి వచ్చేటప్పటికి—

ఎవళ్ళో కొత్తబంధువులు—కాఫీలూ— ప్రేమలూ—పలకరింతలూ—ఓదార్పులూ—

ఓ ముసలావిడ గొల్లుమంటూ, కాశీరత్నం బుజం నిమురుతూ— 'తండ్రిపోయినా ఏదో పెద్దతనం వహించి, కొంత నిలబెట్టుకున్నావురా బాబూ!...భగవంతుడు పగ సాధిస్తున్నాడూ...సంసారమే ప్రధానం అనుకోవాలింక తప్పుతుందా—సుఖాలూ, దుఃఖాలూ, ఇవాళుండేవీ, రేపుపోయేవీ—వీళ్ళందర్నీ పైకి తీసుకొచ్చి, ఇంత కలోగంజో పోసి, దారి చూపిస్తివా—పెద్దముండని చెబుతున్నాను—

స్వర్గంలో ఉన్న మీనాన్న మనస్సుకి శాంతి...' ముసలావిడ కన్నీళ్లలో ఓదార్పుని మింగుకుని, కాశీరత్నానికి ధైర్యం చెప్పింది.

కాశీరత్నం భార్య కళ్లుతుడుచుకుని, పక్కగదిలో, వొచ్చేదగ్గుతెరనీ, గుండె మంటనీ అణచుకుంటూ, మొగానికి సగం సగం వేసుకున్న పౌడర్ చెరిపేసుకుంటోంది.

కాశీరత్నం గదిలోకొచ్చి, కళ్లుతుడుచుకుని నవ్వాడు.

భార్యదగ్గర కొచ్చి నిలబడ్డాడు. ఆమె తలెత్తిచూసి, లేచి నిలబడి తలొంచుకుంది.

నలుపురంగు మొహంమీద తెల్లని పౌడర్, చర్మాన్ని నీలంగా మార్చినట్టుంది.

కాశీరత్నం, భార్యభుజంమీద చెయ్యి వేశాడు.

ఆమెకళ్లల్లో నీళ్లు చంపలమీదికి జారాయి.

ఏదో సినిమా జ్ఞాపకంవచ్చి చటుక్కున కన్నీరు తుడిచాడు.

'ఎందుకూ—?' కళ్లతోటే, ప్రశ్నించాడు.

'మామగారు...' బొంగురుగా అంది, గొంతు సవరించుకోకండా— కాశీరత్నం నవ్వలేదు ఈసారి—

'మామగారి కోసం చాలామంది ఏడుస్తున్నారు—నీకోసం నువ్వు ఏడుచుకోలేక— అది చెప్పక అబద్ధం ఎందుకు?' అన్నాడు.

'నిజంగా—' అంది.

'ఏమిటి. అబద్ధం నిజమా!' అన్నాడు.

# అంతరంగ తరంగాలు

నెర్వస్‌గా కళ్లు చిట్లించి, అతికష్టంగా ఊపిరిపీల్చి, గుండెలమీద చేత్తో అదుముకుంటూ, చతికిలబడి కూర్చుంది.

'ఇవాళ హాస్పటల్‌కి వెళ్లావా?' అన్నాడు.

'లేదు' అన్నది మామూలుగా— కళ్లు కొద్దిగా తెరుస్తూ—

'చచ్చిపోవాల్సిందేవిటి ఈ జబ్బులో... నేను అటు మావాళ్లకీ, యిటు నీకూ... ఏమిటో, ఏం ఉపయోగ పడుతున్నాను?' అన్నాడు కాశీరత్నం.

'అదేవిటి!—తప్పు!' అంది ఆమె.

'ఇప్పుడు కాదుగానీ—రేపు ఉదయం హాస్పటల్‌కి తీసుకువెళ్తాను. అశ్రద్ధచేస్తే మరేం అవకతవకల్లోకి దింపుతుందో!'...

అన్నాడు—అతనికింకా చాలా మాట్లాడాలని ఉంది. కాని, కొన్ని విషయాల్ని తన వయస్సూ, మొగతనం, మాట్లాడనివ్వలేదు.

'ఒరే కాశీ, చూశావా, బొమ్మ వెళ్లిపోతారట—ఉండకండా...కాశీరత్నం ఓపూట పట్టెడన్నం పెట్టలేడా...'

కాశీరత్నం తల్లిమాట కద్దుపడి—

'ఒస్తున్నా, అదేవిటది!—' అంటూ వెళ్లాడు.

కాశీరత్నం భార్య విషాదంగా నవ్వుకుంది. ఆ వెనక పున్నమివెన్నెలలో భారుమనే సమాధుల శిలలు స్ఫురించాయి.

* * *




ఇంకో కలోజా—

కాశీరత్నం తల్లివసారాలో కూర్చుంది బయట జల్లుపడి వెలిసింది. చలిచలిగాలి చర్మాన్ని కోస్తోంది.

చినిగిపోయిన పాతచీరని కుట్టుకుంటోంది.

చిన్నకొడుకు కాసిన్నిపాలు తాగి పడుకున్నాడు.

ఉదయం తొమ్మిది దాటింది.

కాశీరత్నం గది గుమ్మానికి వేసిన తెర చూసింది.

గదిలో ఒక అగరొత్తు సగంపైగా కాలి, పొగ వ్యాపిస్తోంది.

కాశీరత్నం తల్లి అటు చూసింది చటుక్కున కుట్టడం మాని అతని గదిలోకి వెళ్లింది చూస్తోంది.

పక్కమీద కాశీరత్నం భార్య విప్పి పారేసిన జాకెట్టుతీసి, కసిగా ముక్కలు చేసింది.

గోడనున్న అగరొత్తు తీసి కిటికీలోంచి బయటికి విసిరేసింది.

చూస్తోంది.—

గూటిన ఉన్న చిన్న భరిణలోంచి తీసి, చిన్న చిన్న నల్లమందు మాత్ర వేసుకుంది.

ఏవో కేలండర్లు—ఒక శృంగార సంబంధమైన బొమ్మకేసి చూసి, తన కేసి చూసుకుంది.

మబ్బువల్ల చీకటి చీకటిగా ఉంటే, దీపం వేసింది.

అద్దంలో చూసుకుంది.

అక్కడక్కడ కొద్దిగా నెరుస్తోన్న తల— కళ్లల్లో మెరిసే యౌవనపు వెలుగు క్షీణించింది చాలామట్టుకు—

కొడుకు గదిలో ప్రతి వొస్తువూ ఏదో ప్రత్యేకంగా కనిపించింది.

కిటికీ గూట్లో ఉన్న 'ఇంటర్నేషనల్—హెల్త్' పత్రిక అట్టమీద వస్తాదు బొమ్మ...దుమ్ము దులిపి, అటూ ఇటూ చూసింది.

గుండ్రని, నున్నని జబ్బలూ, బలిష్ఠమైన పిక్కలూ,—ఛాతీ—

పత్రిక ఉండచుట్టి కిటికీలోంచి విసిరేసింది.

బయటనించి ఎవరో కేకేశారు. గబగబ వచ్చింది.

'ఎవరూ'— తలుపు తీసింది.

'కాశీరత్నంగార్ని అయ్యగారోసారి రమ్మన్నా

# తలనొప్పిగా ఉందా?



## 2 అనాసిన్ చప్పున తగ్గిస్తుంది

తలనొప్పిగ ఉన్నప్పుడు నరాలు బిగువుగా, ఉదాసీనంగా, అలసటగా ఉంటుంది. చిఱచిఱలాడుతూ, చీటికిమాటికి కోప్పడుతూ, ఉంటారు. 2 అనాసిన్ వెంటనే తీసుకోండి. అవి నాలుగు విధాలుగ ఎంత వేగంగా పనిచేస్తాయో చూడండి:

1. అనాసిన్ తలనొప్పిని తగ్గిస్తుంది — చప్పున
2. అనాసిన్ అలసటను తీసివేస్తుంది — చప్పున
3. అనాసిన్ ఉదాసీనతను పారదోలుతుంది — చప్పున
4. అనాసిన్ నరాల బిగువును సడలిస్తుంది — చప్పున

ఇందుకు కారణం, డాక్టరిచ్చిన ప్రిస్క్రిప్షనువలె అనాసిన్‌లో ఔషధాలు కలిసి ఉన్నాయి. భారతదేశంలో ఇతర బాధోపశమనకారులకన్నా అనాసిన్‌నే ప్రజలు ఎక్కువ వాడుతున్నారంటే అందులో ఆశ్చర్యపడవలసింది యేమిలేదు.

ఈసారి తలనొప్పిగ ఉంటే, అనాసిన్ తీసుకోండి. అనాసిన్ జలుబులు, ఫ్లూ, పంటినొప్పి, ఒళ్ళునొప్పులనుండి నివారణనిస్తుంది. అనాసిన్ ఎప్పుడు దగ్గర ఉంచుకోండి.

అనాసిన్ కావాలని పట్టుపట్టండి.

# అనాసిన్

**చాలా మంచిది**

**ఎందుకంటే, అది 4 విధాలుగ పనిచేస్తుంది**




Registered user: GEOFFREY MANNERS & COMPANY LIMITED

# అంతరంగ తరంగాలు

రండి—' అన్నాడు.

'నువ్వెవరివి—' అంది.

'ఆఫీసు బంట్రోతునండి—' అన్నాడతను. అతన్ని చూసింది—మోటుగా బలంగా కని పించే అతన్ని—

'అట్లాగే చెప్తానమ్మా. భార్యగారిని తీసుకుని హాస్పత్రికి వెళ్ళాడు. రాగానే చెప్తా—మీ పేరేవరన్నావూ!'

'ఎందుకండీ—యీరన్నంటారండి.'

'ఇదిగో వీరన్నా, యిలా చూడమ్మా, చిట్టి అటకమీద కొబ్బరికాయలున్నాయి, వాలుక్కాయలు తీసి కింద పారేద్దూ, డబ్బు లిస్తా—' అంది.

'వాక్కుదరదమ్మా, కుర్రాయనొచ్చాక అరితో చెప్పండి—' వెళ్ళిపోయాడు.

'ఏం పొగరుమోత్తనం!' అని వాడికేసి విసుగ్గా చూసి—లోపలికొచ్చింది.

కాశీరత్నం గది గుమ్మానికి కట్టి ఉన్న తెర, ఆమె తలకి చుట్టుకుంది గాలికెగిరి—విసుక్కుని ఆ తెరని ఓ మూల చింపింది.

కాశీరత్నం భార్యను తీసుకుని లోపలికొచ్చాడు ఆఫీసుకి వెళ్ళాలని తల్లి చెప్పింది. ఆమె కోడల్ని ఓరగా చూస్తూ వెళ్ళిపోయింది.

కాశీరత్నం నవ్వుకున్నాడు.

* * *

కాశీరత్నం స్నానంచేసి వచ్చాడు.

అతని భార్య అతని తలకి కొబ్బరినూనె రాసి వెళ్ళిపోయింది.

అద్దం ముందు నిలబడి తల చూసు కున్నాడు నెరుస్తోంది.

కాశీరత్నం మనస్సు, తలా, రెండూ తెల్ల బడ్డాయి.

మనస్సుకి పెద్దతనం వస్తోంది. ఆలోచ నలతో తల కాగిపోయి నెరుస్తోంది.

తల తుడుచుకున్నాడు జిడ్డుగా ఉందవి. లోపలి గదిలోకి వెళ్ళి 'డై' తెచ్చి, తలకి పూసుకుని, తల ఆరబెట్టుకుని, స్నానంచేసి మళ్ళీ అద్దంలో చూసుకున్నాడు.

నల్లబడ్డ, జుట్టుతో మొహానికి కొత్త అందం వచ్చినట్టుంది.

ఎందుకో ఆనందంగా ఉందీరోజు — కాశీరత్నం బట్టలుమార్చుకుని. అద్దంముందు నిలబడి తల దువ్వుకుంటూ భార్యని పిలి చాడు.

వచ్చింది.

నెమ్మదిగా అంది— 'అలా గట్టిగా అరుస్తారెందుకు? మీరు పిలవడం వినడంతోటే ఆవిడ, కసిగా, పనిగట్టుకుని ఏదో తెమ ల్చుకు బయటపడలేని పని చెబుతుంది — ఏమిటో ఆ అక్కను — ఒక క్షణం మనం ఇలా మాట్లాడుకుంటూ నిలుచున్నామా!— ఏంటో గంగవెర్రు లెత్తిపోతుంది. నా కేదోపని చెప్పి పంపేసేదాకా...ఇంతకీ...'

'ఇస్— నన్నొద్దని నువ్వరుస్తావే!—ఏం— ఇంకేం చెయ్యను?—'

'సరి—ఇదీ మరీ బాగుంది—నేను పని చూసుకుంటున్న ప్రాంతంలో నోసారి నాకు కనిపించిపొండి — ఏదో కారణంగా — నేనే వస్తా...' తొందర తొందరగా మాట ల్లంలో గొంతులో ధ్వని తొణికింది. దగ్గ రైన కమ్మింది. ఉక్కిరి బిక్కిరైంది. ఆయాసపడింది. కనుకొలకుల్లో నీళ్ళు తిరిగాయి—

కాశీరత్నానికి జాలివేసింది. దగ్గరగా తీసు కుని, దగ్గు తగ్గేవరకూ బుజం, వీపు, నిమురుతూ పట్టుకున్నాడు. కాశీరత్నానికి అప్పుడు ఏడుపొచ్చింది,

కాశీరత్నానికి భయంతో కూడిన సందేహం వచ్చింది.

కాశీరత్నం భార్య అతని కౌగిటిలో నిర్లి ప్తంగా పెదవి విరిచింది.

మమతా, విరక్తీ, ముడిపడ్డట్టున్నారు వాళ్ళు—

మొగవాడూ ఆడదీ సంఘాన్ని దాటి వెళ్ళకూడదు. సంఘం ఆచారాల్ని దాటి వెళ్ళ కూడదు. ఆచారాలు బుషుల్నిదాటి వెళ్ళ కూడదు. బుషులు వేదాల్ని దాటి వెళ్ళ కూడదు. వేదాలు బ్రహ్మని దాటి వెళ్ళ కూడదు — బ్రహ్మ సృష్టిని దాటి వెళ్ళ కూడదు. సృష్టి లోకాల్ని దాటి వెళ్ళ కూడదు— లోకాలు ప్రళయాన్ని దాటి వెళ్ళకూడదు— ప్రళయం శివుడి మూడో కన్ను దాటి వెళ్ళకూడదు—

కాశీరత్నం, జబ్బు రంగు నెత్తుటితో వెలవెలబోయే భార్య ముఖాన్ని చూసి భయ పడకూడదు—

ఇందుకేనేమో, కాశీరత్నానికి సర్వం సందేహాగ్రస్తంగా, సమస్యామయంగా కని పిస్తుంది.

'అవునుగాని, ఇవెక్కడా చూడలేదు—'

వినేయ్యా— ఆ పిల్లాడికలా ఒంటిమీద నీళ్ళుపోసి, లోపలికి చక్కావచ్చావుకదా, వాళ్ళు నానిపోతే, ఏడుస్తూ, దిక్కుమాలిన వాడిలా, వాడు అలా ఉండాల్సిందేనా!...' అని మాట్లాడేసుకుంటూ, కాశీరత్నం భుజం నుంచి తల తీసుకుని, కన్నీళ్ళు తుడుచుకునే కోడల్ని చూసి, గుమ్మంలోనే ఆగిపోయింది.

కాశీరత్నం భార్య లోపలి గదిలోనికి వెళ్ళి పోయింది.

అతను తల్లి మొహం కేసి భయం భయంగా చూశాడు.

ఆవిడ ఆలోచిస్తూ నిలబడిపోయింది. కాశీరత్నం తలొంచుకుని వీధిలోకి వెళ్ళి పోయాడు.

* * *

రాత్రి కాశీరత్నం ఇంటికొచ్చేటప్పటికి ఆలస్యమైంది.

కాశీరత్నం వెన్నెట్లో నడిచి వచ్చాడు. మొహం, తన స్వంత వయస్సుని జ్ఞాపకం చేసుకుంటోంది.

కాశీరత్నంలో ఇన్నాళ్ళూ అణిగిమణిగి ఉంటోన్న ఏదో శక్తి—దృఢమైన కామన—విజృంభిస్తోంది.

భార్యని బాగు చెయ్యడమో, చంపెయ్యడమో, ఏదో ఒకటి తేల్చుకోవాలనుకున్నాడు. ఓ వందరూపాయలు అప్పు తెచ్చాడు.

రాత్రి పది దాటింది.

కాశీరత్నం తలుపు తట్టాడు—

తల్లి, తలుపుతీసి 'ఇప్పటిదాకా ఎక్కడున్నావూ?' అంది అనుమానాస్పదంగా —

'పని ఉండి ఉన్నాను' అన్నాడు.

'అంటే —'

'అంటే—అదేది...అరుంధతీ...' పిలిచాడు భార్యని—

'ఎందుకూ? తమ్ముడు తిక్కగా నిద్ర పట్టక యేడుస్తోంటే జోకొట్టి నిద్ర పొగొడ్తోంది. అక్కడే ఆవిడగారూ జోగుతోంది—ఇప్పుడు లేపకు—మవ్వెళ్ళి పడుకో—అందావిడ—

కాశీరత్నం తల్లికేసి పరీక్షగా చూశాడు. ఎప్పుడూ రానంత కోపం వచ్చింది — మింగేసుకుని, మళ్ళీ వీధిలో కొచ్చాడు.

'ఒరే కాశీ...' అని తల్లి కేకేసింది. అందకుండా వెళ్ళిపోయాడు.

ఓ రాత్రివేళ మెళకువ వచ్చి అరుంధతి లేచింది.

వాకిట్లో, కాశీరత్నం, అత్తగారూ, ఏదో ఘర్షణపడ్డం వినిపించింది.—

'అర్ధరాత్రివస్తే తలుపులు తియ్యలేరెవ్వరూ ఇక్కడ — ఇంత దౌర్భాగ్యుడవై పోతున్నావేం!'

'నీ కొడుకునేగా—'

'ఛ నోర్ముయ్యి — దిక్కుమాలినవాడా—పెద్దా పిన్నా లేకుండా, ... పేట్రేగిపోతున్నావ్...'

'నన్నవసరంగా రెచ్చగొట్టకు' అన్నాడు తల్లితో కాశీరత్నం తెగించి—

కాశీరత్నం తల్లి ఇది ఏనాడూ ఊహించ లేదు. ఆమె ఆవేశం వశం తప్పింది—

'అడ్డమైన షికార్లూ చేసి వచ్చిపడి, ఇంకా బుద్ధిలేక...' ఏదో అనబోయింది.

'నీ కనవసరం—' అన్నాడు

'ఏం పేలావూ!—' అంది గుడ్లురిమి.

అతనికి లోపల భయంగా ఉన్నా, కసి తెచ్చుకుని అన్నాడు.

'నోరుముయ్యమంటున్నా —' అన్నాడు ఆవిడ అదిరిపడింది.

తెల్లబోయింది — కన్నీళ్ళు తిరిగాయి. పళ్ళు పటపట కొరికి,

'ఛీ—సన్యాసినెధవా' అనేసి కళ్ళొత్తుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది.

* * *

సరిగ్గా రాత్రి రెండూ, మూడు గంటల మధ్య అరుంధతి కాశీరత్నాన్ని లేపింది. అత్తగారు వరండాలో లేకపోవడం చూసి—

కాశీరత్నం ఉలికిపడి లేచి, భార్యతో కూడా వంటింటి గుమ్మంవైపు వెళ్ళాడు.

తల్లి గుమ్మంలో పడి ఉంది. కాలికేదో తడిగా తగిలితే దీపంతో చూశాడు. కాలి కింద నూనె జిడ్డు. నల్లమందు భరిణ లోంటినించి జారిపడి ఉంది.

గొల్లుమన్నాడు.

మనస్సు పునాదిమీద లేచిన వికారాల వ్యక్తిత్వం శరీరం మీంచి జారిపోయింది.

కాశీరత్నం భార్య కొవ్వొత్తి వెలిగించి తలాపు దిక్కున పెట్టింది.

* * *

రాజేశ్వరి అత్తయ్యా వాళ్ళ ఊరు వెళ్ళినప్పుడు అత్తయ్య చెప్పింది—వింతగా నాకీ సంగతి—

నేను కొన్ని ప్రశ్నలడిగాను. కొన్నిటికి సమాధానాలు చెప్పింది—కొన్నిటికి చెప్పలేదు. చివరికి విసుగ్గా అంది.

'ఏం ఉంది చెప్పడానికి! — వయస్సులో మొగుడు పోయాడుగా—దీనికి వయస్సెంత నాకంటె చిన్నదికదూ?— అయినా, ఓపతాయిత్వం మనిషికాకపోతే ఏమిటి చెప్పు — వాణ్ణి సరిగ్గా బతకనివ్వక కోసుకుతినేస్తోంటే, ఏదో అన్నట్టున్నాడు—అన్నట్టున్నాడేం ఖర్మ అన్నాడు ఎదిరించాడు — అహంకారానికేం లోటు దీనికి ... అయినా అంత 'యిది' పనికిరాదు ఆడదానికి —'

ఎందుకెందుకంటూనే అత్తయ్య మెరుపులాంటి నవ్వు నవ్వింది 'ఇది' మీద ఒత్తి పలుకుతూ—



ఇట్టల్లో ఎదురుగా కనిపించాడు. రామచంద్రం తనపాలిట రాక్షసుడుగా కనిపించాడు ఆనాడు. తనను అతను బ్రతికించినందుకు ఎంతగానో దుఃఖించాడు.

'మాష్టారూ...యింత అఘాయిత్యానికి ఎందుకు ఒడిగట్టారు...? రాజీ టీచరు మిమ్మల్ని ఎంతగానో ప్రేమించారు. ఇదిగో ఈ పుత్తరం చూడండి' అని ఉత్తరమందజేశాడు.

తనసప్పుడు పజిల్ చేసింది ఆ ఉత్తరం కాదు. రామచంద్రం పనుపుబట్టలు.

కొంచెం కొంచెం తెలివి రాసాగింది.

అప్పుడు తల ప్రక్కకు తిప్పిచూశాడు. శాంత కనిపించింది కుందనపు బొమ్మలా వుంది. ఆమెకూడా పెళ్లికూతురే! వచ్చే కన్నీళ్లను ఆపుకుంటూ తన కాళ్లను కంటికి అద్దుకుంది.

తనకప్పుడు మరింత ఆశ్చర్యమైపోయింది.

రామచంద్రం గ్రహించాడు కాబోలు, చెప్పాడు— 'ఇవ్వాళే మా పెళ్లి' కాని మీరు...' రామచంద్రం మాట్లాళ్లేకపోయాడు. కాస్త తేరుకుని మళ్లీ అతనే—

'ముహూర్తం దాటిపోయినా, మరేం ఫరవాలేదు. మీ చేతులమీదుగా మాపెళ్లి జరగాలి' అన్నాడు.

అలానే జరిగిపోతుంది.

రాజీ ఉత్తరం తను చదవలేదు. కోపంతో చించి పారేశాడు.

జీవనవ్యాపారాన్నే పూర్తిగా మార్చేసుకున్నాడు. హైదరాబాదుకు సలాంకొట్టి ఇక్కడకొచ్చి పెళ్లిచేసుకున్నాడు.

సుభద్ర అతనికి లోటుచేయదు. కంటికి రెప్పలా కాపాడుకుంటోంది. కొంచెం మనశ్శాంతిచిక్కి ఇప్పుడిప్పుడే భావికి గట్టి పునాదులు వేసుకుంటున్నాడు.

రామచంద్రం ఇప్పుడు తనకు దైవంగా కనిపిస్తాడు. పునఃప్రాణ ప్రతిష్ఠచేసిన బ్రహ్మదేవుడిలా కనిపిస్తాడు.

ఎంతటి సామాన్య సంబంధం ? రామచంద్రం అప్పుడప్పుడే యవ్వనంలోకి అడుగుపెడుతున్నవాడు. శాంత అతనికంటె యింకా చిన్నది. వాళ్లిద్దరూ తమ తమ కోర్కెల్ని ఈడేర్చుకొన్నారు. సంఘం ఇనుపసంకెళ్ళను విదిలించుకొని సమస్యని ఛేదించి స్వతంత్రాన్ని అనుభవించినవాళ్లు!

# చచ్చిపోవని మనిషి

(14 వ పేజీ తరువాయి)

మరి తను,

వయసున్నవాడు, జ్ఞానమెరిగినవాడు, లోకమంటే ఏమిటో తెలిసినవాడు, పరిస్థితులనర్థంచేసుకోగలిగినవాడు ... అన్నీ తెలిసి కూడా ... ఓడిపోయాడు ... తను ఓడిపోయాడు.

'ఓడిపోయాను' అనుకున్నాడు నెమ్మదిగా సూర్యం.

'ఓడిపోవటమేమిటండీ' అంది సుభద్ర అతని చేరువగావచ్చి.

మనస్సును అధీనంలోకి తీసుకొని ఆమె తెచ్చిన కాఫీని అందుకున్నాడు.

సుభద్ర కళ్ళల్లోకి చూస్తూ గతాన్ని మరచిపోసాగాడు.

'పోస్ట్' అన్న కేకవిని సుభద్ర వెళ్లి, ఎక్స్‌ప్రెస్ డెలివరీ కవరుతో తిరిగి వచ్చింది.

కవరు చించి, వుత్తరాన్ని తీశాడు సూర్యం.

ఉత్తరంలోని సంబోధన చదవగానే విచలితుడైపోయాడు.

గబగబా వుత్తరమంతా పూర్తిగా చదివి 'రాజీ' అని గట్టిగా అరిచాడు చివర్లో.

సుభద్రకు ఏమీ అర్థం కాలేదు. భర్తకు దగ్గరగా వచ్చి దిక్కుదిక్కుమంటూ అతన్ని చూడసాగింది.

'నాకు తెలియదు. రాజీ ... నాకు తెలియదు'... అంటూ భోరుమని ఏడ్చాడు.

గుడ్లనీళ్లు కక్కుకొని అలానే నిశ్చేష్టగా నిలచుండి పోయింది సుభద్ర.

'ఏమండీ...' అంది నెమ్మదిగా.

తెలివి తెచ్చుకున్న సూర్యం అక్కడ్నుంచి లోపలికి వెళ్లిపోయాడు. అతని వెనకనే వెళ్లి మంచం మీద కూర్చుంది సుభద్ర.

'ఇక్కడ్నుంచి పో...నన్ను ఒంటరిగా వుండనియ్' అని అరిచాడు సూర్యం.

నోట్లో పైటచెంగు కుక్కుకొని చావిట్లోకి వచ్చింది సుభద్ర. ఆమె కళ్లక్రింద పడి దొర్లుతున్న ఉత్తరం మీద పడ్డాయి. వణుకుతున్న చేతులతో దాన్ని తీసుకుంది. మొదట్లో అక్షరాలేమీ కనిపించలేదు. మబ్బుమబ్బుగా కనిపించాయి. కన్నీళ్లు తుడుచుకుని మళ్లీ చదువుకుంది.

'మాష్టారూ ...

మీరు నన్ను క్షమించరని తెలుసు. క్షమిస్తే ఎప్పుడో మీపాదదాసిగా అనుగ్రహించివుండేవారు. కాని, నామీద మీకింత నిర్దాక్షిణ్యం ఎలా అలవడిందో అర్థంకాకుండా వుంది. కావాలని నేను మీకు దూరమైపోయాననే అపోహలో మీరువుండబట్టే నన్ను క్షమించలేకపోతున్నారు. నేను ఢిల్లీ వెళ్లిపోతూ మీకు ఉత్తరం వ్రాశాను. వెంటనే బయలుదేరిరమ్మన్నాను. పెళ్లిచేసుకుందామన్నాను. కాని మీరురాలేదు. నన్ను పెళ్లిచేసుకోవడం మీకు యిష్టంలేకపోయింది. పైగా నామీద కోపం పెంచుకున్నారు. నేను అవమానించినట్లు బాధపడ్డారు. ప్రాణాలు తీసుకోడానికి కూడా యత్నించారు. నాకావిషయం తెలిసి హుటాహుటీవచ్చాను. కాని, అప్పటికే మీరు రామచంద్రానికి పెళ్లి జరిపించి వెళ్లిపోయారు. ఎక్కడికి వెళ్లారో తెలియకుండా వెళ్లిపోయారు. మీకోసం ఎంతగానో వెదికిచూశాను. నా అడ్రసు రామచంద్రంకు యిచ్చి మళ్లీ ఢిల్లీ వెళ్లిపోయాను. ఈ నాలుగేళ్లనుంచి యిక్కడే పనిచేస్తున్నాను ఒంటరిగా. అయిన వాళ్ళు, కానివాళ్లు అందరు నన్ను అసహ్యించుకున్నారు. కాని జీవితంమీద అసహ్యం కలుగలేదు. మీలా చచ్చిపోదామనుకోలేదు. 'వస్తారు' అనే ఆశ నన్ను చచ్చిపోనీయలేదు. అందుకే బ్రతికాను. మీకోసం మాష్టారూ, మీకోసం. ఆనాడు తల్లిదండ్రులు విధించిన ఆంక్షలకు ఎంతగా కృంగిపోయానో మీతో చెప్పుకోవాలని చూశాను. మీదగ్గర భోరుమని ఏడవాలనుకున్నాను. నాకా అదృష్టంలేదు. ఎక్కడి

కెళ్ళినా ముళ్ళడొంకలే. ముళ్ళడొంకలు పరిచి, నా తల్లిదండ్రులు నన్ను కదలకుండా చేశారు. మిమ్మల్ని దూరంచేశారు. నన్నేం చేయమంటారు? ఢిల్లీలో చుట్టాలదగ్గరికని పంపించారు, నన్ను. కాని, ఆచుట్టాలు యిక్కడలేరు. నేను తిరిగిపోలేదు. ఉన్నారని యింటికి ఉత్తరంవ్రాసి యిక్కడే వుండిపోయాను. మీకోసంఎదురు చూస్తూ. మా వాళ్ళకు నిజం తెలిసి యిక్కడకువచ్చారు. నాకెవరూ లేరన్నాను. వాళ్ళు అలానే అనుకొని వెళ్ళిపోయారు. రామచంద్రం ఉత్తరం వ్రాశాడు. మీ అడ్రసు అతికష్టంమీద సంపాదించాడట. వెంటనే మిమ్మల్ని చూడటానికి వెళ్తున్నానని వ్రాశాడు. నన్నుకూడా రమ్మని రాశాడు. మీ అడ్రసు తెలిసిన తర్వాత నా కిప్పుడెంతో ఆనందంగావుంది. వచ్చేస్తున్నాను. మీదగ్గరికి వచ్చేస్తున్నాను. నన్ను మీరు కాలదన్నినాసరే, కదిలేదు లేదు. మీచేతలేదనిపించుకున్న నాకసలు ప్రాణమీద తీపివుండబోవుండదు. నాకోసం స్టేషనుకి రాకపోయినా ఫరవాలేదు. నేను మీయింటికి నేరాసరివస్తాను. నేను వచ్చే సరికి మీరు యింటివద్ద ఉండరని తెలుసు. కాని ఒక్కటిమాత్రం జ్ఞాపకముంచుకోండి. మిమ్మల్ని చూడందే చావను. నిజం!

మీ

రాజీ!'.

సుభద్ర కళ్ళనుండి నీరు ధారగా కారుతోంది. వచ్చే ఏడ్పును ఆపుకోటానికి ఎంతో కష్టపడుతూ వుంది. గడియారం ఒంటిగంట కొట్టింది.

'రైలు స్టేషనుకు వచ్చి వుండొచ్చు.' అనుకుంటూ స్టేషనుకు వెళ్ళింది. సూర్యంతో చెప్పలేదు. ఒంటరిగానే వెళ్ళింది.

ప్లాట్‌ఫారమంతా ఖాళీగా వుంది. రైలు వచ్చి వెళ్ళిపోయింది. రామచంద్రం, శాంత యిద్దరే నిలబడి వున్నారు.

తొందరగా నడచి వాళ్ళను చేరుకుంది సుభద్ర.

ఆమెను చూడగానే రామచంద్రం కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి.

'క్షమించండమ్మా... సూర్యానికి పెళ్ళి కాలేదనుకున్నాను. నాకాయన చేతులమీదుగానే పెళ్ళి జరిగింది. వారికి నేను సహాయం చేద్దామనుకున్నాను. తిరుపతి వెళ్దామని కాదు నేనువచ్చింది. వారికి ఒక ముఖ్య విషయాన్ని తెలియపరచి నాకు తోచిన విధంగా సహకరించి ఆయనను ఒక యింటివారిని చేద్దామనుకున్నాను, కాని...' అంటూ ఇంకా ఏమేమో చెప్పబోయాడు.

భరించలేక పోయింది సుభద్ర.

'రాజీ ఏదీ?' అంది గట్టిగా.

అది వినపడిన రామచంద్రం—

'సూర్యానికి పెళ్ళయిందని తెలుసుకుని దిగకుండా యిట్టే వెళ్ళిపోయింది. ఇంతకీ నేనే కారణం. నన్ను క్షమించండమ్మా..'

సూర్యం అదే సమయానికి వచ్చాడు.

'సుభా. నువ్వు...యిక్కడ...'

సూర్యం మాటల్ని వినిపించుకోలేదు సుభద్ర. అతన్ని గట్టిగా కౌగలించుకుని వెక్కివెక్కి ఏడుస్తూ—

'రాజి యిక్కడ దిగకుండా వెళ్ళిపోయిందండీ...' అంది.




డబ్బును సృష్టించిన మనిషి గొప్పవాడా? మనిషిని పాలించేఆ డబ్బుగొప్పదా? ఏది గొప్ప? ఎందుకు?

వి. కస్తూరి, తూర్పుపాలెం.




మనిషి గొప్పదనానికి మించింది లేదు. డబ్బుదేంవుంది. ఇనాళ నా దగ్గరుంటుంది. రేపు మీ దగ్గరుంటుంది. మూణ్ణాళ్ల ముచ్చట!

మీ జవాబే పదివేలుకదా! ఇంక పదిరూపాయల బహుమతి ఎందుకు?

కుమారి ఆర్. పండరీబాయి, విశాఖపట్నం.

సంతోషచిహ్నంగా చిన్నకట్నం!

సినీనటీనటులు సమ్మె చేస్తే....?

కె. చిట్టిబాబు, అనంతపురం.

ఇన్‌కంటాక్స్ డిపార్టుమెంటువాళ్లు తలుపులు మూసుకొని 'అయ్యోరామ' అని పిచ్చెక్కిపోతారు.

బిడ్డపై తల్లిదండ్రులలో ఎవరికి ఎక్కువ హక్కు వుంది?

పి. యల్. మోహన్, సికింద్రాబాద్.

నవమాసాలుమోసి కన్న మాతృదేవికని వేరే చెప్పాలా?

నాకు క్లాసుబుక్స్ మీదకన్న నవల్స్‌మీద మక్కువ ఎందుకు?

వై. మూర్తి, పలాస

బుద్ధిగా పాసవడం మీకు'ఇష్టం లేదు గనుక! జీవితం విలువ తెలీదు గనుక!!

ఒక స్త్రీకి అయిదుగురు భర్తలుండవచ్చునుగాని. ఒక పురుషునికి ఇద్దరు భార్యలు అనగానే చట్టం అంటూ రెందుకండీ?

కె. వి. ఎన్. ఎల్లాజీరావు భిలాయ్‌నగర్,




పాండవులకాలంలో చట్టంలేనందువల్ల ద్రౌపదికి అయిదుగురు భర్తలతో కాపురంచేయడానికి లైసెన్స్ ఇవ్వబడింది. ఇప్పుడు ప్రతిదానికీ చట్టం అనే పిశాచి ఒకటివుంది గనుక—లైసెన్స్ లేకుండా సైలెన్స్‌గా బతకాలని నిబంధన పెడుతున్నారు.

మీరు పాతాళభైరవిగో అంతచిన్న పిల్లాడిలా వున్నారు. అప్పుడు మీవయసు ఎంతవుంటుంది?

సి. హెచ్. వీరయ్య, అగ్నిగుండాల.

రెండు పుష్కరాలు.

సాధారణంగా అంతా సంతోషంగా వున్నప్పుడే పాటలు పాడుకుంటారు. కాని మన సినిమాల్లో నాయకీనాయకులు సంతోషసమయాల్లోనే గాక దుఃఖసమయంలో కూడా ఏడుస్తూ పాడతారెందుకు?

సి. రాంబాబు, పిఠాపురం,




జనం కాస్సేపైనా బయటికి వెళ్ళి సిగరెట్లు, బీడీలు తాగడానికి!

ఉత్తమ నటనకు ప్రతియేట ఒకకళాకారునికి నోబుల్ బహుమతి యిస్తే ఎలా వుంటుంది?

కె. సురేంద్రరావు, ఆర్మూరు.

నోబుల్‌గానే వుంటుంది మరి, అలా ఇవ్వరుగా!

నటుడు పద్మనాభం గొప్పవాడా? పద్మనాభంలోని నటుడు గొప్పవాడా?

ఎన్. గోవిందయ్య, కొత్తగా దిగకుంట.

మీరంతా మెచ్చుకుంటున్నారు గనుక పద్మనాభంలోని నటుడే గొప్పవాడు. కాని, గొప్పలు చెప్పుకోవడం, వినిపించుకోవడం నాకిష్టంలేదు.

హిరణ్యకశిపుడు మొదట దండయాత్ర చేసింది వైకుంఠంమీదనా, లేక స్వర్గంమీదనా?

డి. ఎస్. రాము, సీతారాం, అనంతపురం.




ఈ ప్రశ్న మీ హిస్టరీ మేస్టర్ని అడగండి.

సినిమాల్లో సాధారణంగా దేవకన్యలు భూలోకానికివచ్చి జలకాలాడినట్లు చూపిస్తారు. వాళ్ళకి దేవలోకంలో తీరుబాటు లేకనా? లేక ఇక్కడలాగే అక్కడకూడా స్కీము ప్రకారం పంపులు కట్టిస్తారా?

వి. బదినారాయణరావు, కారంపూడి.

వేసవికాలంలో మనతారలు ఊటీ, కొడైకెనాల్ వెళ్ళినట్లు, దేవలోకంలో చూసిన మొహాలే చూసిచూసి బోరుకొట్టి — జలకాలవంకతో భూలోకవాసులకోసం వేటకు వస్తారు.

నేనేపద్మనాభాన్నయి, మీరేసత్యనారాయణయితే ఎలా వుంటుందంటారు?

బి. సత్యనారాయణ, కొత్తగూడెం.

నేను కొత్తగూడెంలోను, మీరు మద్రాసులోను ఉండే వాళ్లం.

మీరు సొంతంగా పాడగలిగికూడా ఇతరుల గొంతు ఎరువుతెచ్చుకుంటారు, ఎందుకు?

యు. మనోరమ, హైదరాబాద్.

తీరుబడిలేక !

సుఖం తాను ఒక్కడు మాత్రమే అనుభవిస్తూ దుఃఖం నలుగురికీ పంచిపెట్టడానికి మనిషిసందేహించడు, ఎందుకు?

కె. మహమ్మదాలీ, పామిడి.

తనకు లాభంలేనిది గనుక. అప్పుడే మనిషిలోని నీచపు బుద్ధి బయట పడేది.

మీరు ఏ సినిమాలో ఏడ్చినా నవ్వినట్లే ఉంటుంది. ఎందుకు?

జి. వి. భూదేవి, విల్లుపురం.

కొంపదీసి నవ్వితే ఏడ్చినట్లుండదు కదా ?

మీరు నటించిన చిత్రాలలో మీకు నచ్చిన సన్నివేశం ఏది? మీకు మరపురాని సంఘటన ఏదైనా ఉన్నదా? ఏది?

వై. రమణరావు, జబల్‌పూర్.

తన అపూర్వ మంత్రశక్తితో ప్రాణప్రతిష్ఠ చేయగలిగిన గురువు శిరస్సు నరకబడినపుడు సదాజపుడనగు శిష్యుడనైన నేను—సంజీవిసహాయంతో గురువుకు ప్రాణంపోసి, జీవించాడని తెలీగానే అవ్యక్తానందమూ, ప్రేమా, గురుభక్తీ అన్నీ మేళవించిన 'పాతాళభైరవి'లోని సన్నివేశం.

పద్మనాభంగారూ! రాముడూ, లక్ష్మణుడూ కృష్ణుడూ మొదలగువారు కూడా రాజులేగదా! మరి మిగిలిన వారికివలె వారికి మీసాలు ఉండక పోవటానికి గల కారణం ఏమిటో వివరిస్తారా?

ఎ. డి. ప్రసాదరావు, నర్సీపట్నం.




### బహుమతిపొందిన ప్రశ్న

జీవితంలో—స్త్రీ అయినా, పురుషుడయినా ఎక్కువగా ఆనందించవలసిన దినమేది?

కె. శ్యామ్, కుడుములగుమ్మం.




ఆదివారం !

అవతారపురుషులు కానివారికి పాపం పెరిగినట్లు గడ్డాలూ మీసాలూ పెరుగుతూంటాయి. అవతార పురుషులకు ఆ బాధ ఉండదు.

స్త్రీయొక్క మనసును పురుషుడు తెలుసుకోలేడు, ఎందుకు?

కె. శాంతి, రాజమండ్రి.

దానికింకా 'ఎక్స్‌రే'లు కనిపెట్టలేదు కాబట్టి !

''లోకోభిన్నరుచి' అంటారే! మరిబెల్లం అందరికీ తియ్యగానే వుంటుంది. ఎందుచేతంటారు?

ఎ. వి. ఆర్. అన్నపూర్ణ, గుంతకల్లు.

'లోకోరుచి గనుక బెల్లము అందరికీ తియ్యగనుండును.'

పద్మనాభం

చిత్రసమీక్ష:

# సర్కస్ వరల్డ్

కింగ్ ఆఫ్ కింగ్స్, ఎల్ సిడ్, 55 డేస్ ఎట్ పెకింగ్, ఫాల్ ఆఫ్ ది రోమన్ ఎంపైర్ వంటి ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన చిత్రాలను నిర్మించిన శామ్యూల్ బ్రాన్‌స్టన్ తయారుచేసిన ఈ చిత్రంలో సర్కస్‌లోని ప్రాథమిక విషయాలనుంచి అత్యద్భుతమైన ప్రదర్శనలవరకూ చిత్రీకరించడమేగాకుండా సర్కస్‌బృందం జీవితాలను, వారి భావావేశాలు, అనుభవాలను చిత్రీకరిస్తూ కథ, నటన, హాస్యం మొదలైనవాటిని చొప్పించి సామాన్య ప్రేక్షకుని మొదలుకొని అందరూ ప్రశంసించే రీతిలో ఈ చిత్రాన్ని రూపొందించారు. పిల్లలకు కూడా ఈ చిత్రం ఎంతో వినోదాన్ని కలిగించేలా, అధునాతన నాగరికతా చిహ్నాలకు దూరంగా ఉండటం చెప్పుకోదగిన విషయం.

ఈ చిత్రంలో జాన్‌వేన్, క్లాడియా కార్డినేల్, రీటా హేవర్త్, జాన్ స్మిత్, రిచర్డ్ కాన్‌టే మొదలైనవారు నటించారు. దర్శకుడు: హెన్రీహాథ్వే. టెక్నికలర్‌లో కన్నులపండువుగా నిర్మించబడినది ఈచిత్రం.

ఈ చిత్రంలో జాన్‌వేన్, రీటా హేవర్త్, క్లాడియా కార్డినేల్‌లు అత్యంత ప్రతిభావంతమైన నటనను ప్రదర్శించారు. మిగి



"స్త్రీజన్మ"లో ఎల్. విజయలక్ష్మి

# చిత్రలహరి

తిన పాత్రధారులంతా ఒకరికొకరు తీసిపోని విధంగా నటించి తమ తమ పాత్రలకు జీవం పోశారు.

రాంక్ ఆర్గనైజేషన్ ఓవర్‌సీస్ డివిజన్ ద్వారా విడుదలైన ఈచిత్రాన్ని ప్రస్తుతం మద్రాసులోని న్యూ ఎల్‌ఫిన్ స్టోన్‌లో ప్రదర్శిస్తున్నారు.

—ఎం. ఆర్.

శ్రీదేవి కంబైన్స్‌వారి సాంఘిక చిత్రం య్యూలై 2 వ తేదీన ఉదయం గం. 10—19 ని.లకి సీసన్‌స్టూడియోలో ప్రారంభించారు. శ్రీ యన్. త్రివిక్రమరావు పూజచేసి కొబ్బరికాయలుకొట్టి కెమెరా స్విచ్ ఆన్‌చేశారు. మొదటిషాట్‌లో గుమ్మడి నటించారు. కృష్ణకుమారి, హరనాథ్, వాణిశ్రీ, చంద్రమోహన్, గుమ్మడి, రమణారెడ్డి, విజయలలిత, జ్యోతి లక్ష్మి, జయకృష్ణ, ఛాయాదేవి, సబితాదేవి, సాధన, మాజేటి సిస్టర్స్, జి. వరలక్ష్మి, కాకరాల, కె. వి. చలం ముఖ్యభూమికలు పోషిస్తున్న ఈ చిత్రానికి ప్రసిద్ధ మలయాళ రచయిత కె. పి. కొట్టారకార కథ రాశారు. సంభాషణలు: పినిశెట్టి, గీతాలు: ఆరుద్ర, కొసరాజు, సంగీతం: ఘంటసాల, కళ: వాలి, కెమెరా: ఎల్లప్ప, దర్శకుడు: వి.ఏ. సుబ్బారావు. రెండవ షూటింగు షెడ్యూలు పోలీసు రామయ్య (గుమ్మడి) ఇంటి సెట్టు మీద జూలై 20 నుంచి ఆగష్టు 2 వరకు సాగుతుంది. ఈ చిత్రమంతా ఒక్క పది కాల్‌షీట్లు పనితప్ప ఇన్‌డోర్‌లోనే షూటింగు జరుపుకొంటుంది. ఆ పది కాల్‌షీట్సూ తిరుమలకొండలపై కాటేజ్‌లో షూట్ చేస్తారు. సెప్టెంబరు నెలాఖరుకు యీ చిత్రనిర్మాణాన్ని పూర్తిచేయాలనుకుంటున్నారు, నిర్మాత తోట సుబ్బారావు. ఈ చిత్రానికి 'పెద్ద అక్కయ్య' అని పేరు పెట్టారు.



'భామావిజయం'లో యన్. టి. రామారావు, దేవిక.

*  *  *

ఇటీవల శ్రీదేవి కంబైన్స్ కార్యాలయంలో శ్రీ తోట సుబ్బారావును కలిసినపుడు 'మీకొక కొత్తవిషయం చెప్పనా?' అన్నారాయన. 'ఏమిటి?' అని అడిగాను. 'నేనొక పిక్చర్‌లో వేషం వేశాను!' అన్నారు సమాధానంగా. 'మీరా?' అన్నాను, ఆశ్చర్యపోయి. 'ఎందుకంత ఆశ్చర్యం? ఏం, నేను వేయకూడదా?' వేయకూడదని కాదు. మీరు పేరొక పిక్చర్లో వేశారంటేనూ కొంత ఆశ్చర్యం కలిగింది. అంతే! ఇంతకీ ఏ పిక్చర్లో, ఏమిటి వేషం?' 'నిండు మనసులు'లో జడ్జి వేషం!' అంటూ నవ్వి 'రాత్రి తెల్లవార్లూ షూటింగు జరిగింది. స్టూడియోనించి యింతకుముందే వచ్చాను' అన్నారు. ఆయన కళ్ళు నిద్రలేమిని సూచిస్తున్నవి.

*  *  *

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి కొత్త సాంఘిక చిత్రం షూటింగు య్యూలై 16 నుంచి హైదరాబాద్‌లోని శ్రీ సారథి స్టూడియోలో ఆరంభం కానున్నది. నాగేశ్వరరావు, జయలలిత, నాగభూషణం, సూర్యకాంతం, చలం, రాజ్‌బాబు, రమాప్రభ, రమణారెడ్డి, ప్రభాకరరెడ్డి ప్రధానపాత్రలు నిర్వహించే యీ చిత్రానికి భమిడిపాటి రాధాకృష్ణ సంభాషణలు రాశారు. గీతాలు: సి. నారాయణరెడ్డి, కొసరాజు, సంగీతం: టి. చలపతిరావు, కళ: జి. వి. సుబ్బారావు, కెమెరా: సెల్వరాజ్, కూర్పు: కృష్ణస్వామి, దర్శకుడు: టి. రామారావు, నిర్మాత: ఏ. వి. సుబ్బారావు.

*  *  *

ఏ.వి.ఏ. కార్యాలయంలో కూచుని నేనూ, కెమెరామన్ అన్నయ్య మాట్లాడుకుంటున్నపుడు రమణారెడ్డి వచ్చారు. ఆయన్ని రెండుమాసాల క్రితం చూశాను. అప్పుడు ఆయన అనారోగ్యంగా వున్నారు. మళ్ళీ యిదే చూడటం! 'ఆరోగ్యం ఎలావుంది?' అడిగాను. 'క్వయట్ ఓ.కె' అన్నారు నవ్వుతూ. అన్నయ్యకేసి తిరిగి 'మీరు యిదివరకు ఉంటున్నచోటే ఉంటున్నారా?' అడిగారు. 'భారతీ నగర్‌లోకి మారాను' అన్నారు అన్నయ్య. 'మీ పక్కయిళ్ళు ఏమయినా తగలబడ్డాయేమిటి?' అడిగారు రమణారెడ్డి. 'అదేమిటి?' అన్నాను. 'ఈ మధ్య అంతా — ఏమండీ బాగున్నారా లేక కులాసాగా ఉన్నారా? అని అడగటం మానేసి — మీ పక్కయిళ్ళు ఏమయినా అంటుకున్నాయా అని అడగటం పరిపాటయిపోయింది మద్రాసులో' అంటూ చెప్పారు రమణారెడ్డి. నిజమే, నిత్యమూ ఇక్కడ నాలుగైదుచోట్ల అగ్నిప్రమాదాలు జరుగుతూనేవున్నవి. అందేత అలా అడగటం సహజం!

*  *

వాహినీలోని మూడవఫ్లోర్‌లో శ్రీ ప్రొడక్షన్స్ వారి 'మరపురాని కథ' చిత్రం తాలూకు పతాక సన్నివేశాల చిత్రీకరణ జరుగుతున్నది. ఈ పత్రిక మీ చేతికి వచ్చేసరికి నిర్మాణం పూర్తి అవుతుంది. జూలై 27న రాజశ్రీ పిక్చర్స్ ద్వారా ఆంధ్ర అంతటా విడుదల కానున్న యీ చిత్రంలో కృష్ణ, వాణిశ్రీ, చంద్రమోహన్, కాంచన, సంధ్యారాణి, నాగయ్య, నాగభూషణం ముఖ్య భూమికలు ధరించారు. సంభాషణలు : భమిడిపాటి రాధాకృష్ణ. సంగీతం: టి. చలపతిరావు కథ: యస్. కృష్ణారావు, కూర్పు: ఎన్. ఎస్. ప్రకాశం, దర్శకుడు: వి. రామచంద్రరావు బి. ఏ. (ఆనర్స్), నిర్మాతలు: సుందర్‌లాల్ నహతా, డూండీ.

* * *

ఆరవ ఫ్లోర్‌లో శ్రీ లక్ష్మీనారాయణ ప్రొడక్షన్స్‌వారి 'చిక్కడు— దొరకడు' జానపద చిత్రం షూటింగు జరుగుతున్నది. నగరంలో విశాలమైన వీధి. అక్కడ డెబ్బై, ఎనభై మంది సమక్షంలో జయలలిత నృత్యం షాట్ చేస్తున్నారు. పెద్ద మ్యూజిక్ బిట్‌లో ఒకటే డాన్స్ మూవ్‌మెంటు. రీటేక్ లేకుండా చేసింది జయలలిత. నృత్యంలో ఆమెకున్న ప్రతిభకు కొంత ఆశ్చర్యమే కలిగింది. 'సరసగారి వద్ద కదూ మీరు నృత్యం నేర్చుకున్నది?' అని అడిగాను. జయలలిత నవ్వి 'చాలా మంది దగ్గర నేర్చుకున్నాను. అయితే సరసగారి దగ్గర ఎక్కువకాలం అభ్యసించాను అన్నది. 'పది మంది దగ్గరా నేర్చుకున్నపుడే నృత్యంలో చక్కని అనుభవమూ, కొత్త సంగతులూ తెలిసేది!' అన్నదామె తిరిగి.



'మరపురానికథ'లో చంద్రమోహన్, కాంచన.

* * *

'చిక్కడు – దొరకడు' చిత్ర నిర్మాణం చాలా భాగం పూర్తి అయిందనీ, మరొక రెండు షెడ్యూల్స్‌లో మాత్రం పని మిగిలి వున్నదనీ యీ చిత్ర దర్శకుడు శ్రీ బి. విఠలాచార్య చెప్పారు. యన్. టి. రామారావు, జయలలిత, కాంతారావు, కృష్ణకుమారి, బాలకృష్ణ, సత్యనారాయణ, త్యాగరాజు, మిక్కిలినేని, మోహన, మీనాకుమారి, రాజేశ్వరి, జగ్గారావు. సత్యం, గణేష్, కోటేశ్వరరావు మున్నగువారు నటిస్తున్న యీ చిత్రానికి సంభాషణలు వేటూరి రాశారు. సంగీతం ; టి. వి. రాజు. నృత్యాలు: చిన్ని సంపత్, కెమెరా: హెచ్. ఎస్. వేణు నిర్వహిస్తున్నారు.

* * *

తన బిడ్డకోసం బెంగపెట్టుకోని రోజు లేదు కళ్యాణి. ఈ యింట తన బిడ్డను చూడగానే ఎంతో సంతోషమైపోయిందామెకి. పెరగవలసిన చోటనే తన బిడ్డ పెరుగుతున్నది. భర్త శేఖర్ యింటనే పెరుగుతోంది. అంతకన్న తనకి కావలసింది ఏముంది? లోపలికి వెళదామనిపించింది. కాని, ఆ బిడ్డ తననే తల్లినని చెప్పుకోలేని దౌర్భాగ్య స్థితి. సుశీల పాడుతూ పాపను ఆడిస్తున్నది 'పాలు విడువని—పాపను విడిచిన కన్నతల్లిది కడుపా, చెరువా?' ఈ పలుకులు కళ్యాణికి ములుకులై సోకుతున్నవి. అసహాయ స్థితిలో కుమిలి పోతున్నది. ఈ సన్నివేశ చిత్రీకరణను యిటీవల సురేష్ కంబైన్స్‌వారి 'స్త్రీ జన్మ' చిత్రానికి గాను జరిపారు. సుశీలగా అంజలీదేవి, శేఖర్‌గా యన్. టి. రామారావు, కళ్యాణిగా కృష్ణకుమారి నటిస్తున్న యీ చిత్ర నిర్మాణం యీ నెలాఖరుకు పూర్తి అవుతుంది. కృష్ణ. ఎల్. విజయలక్ష్మి, పద్మనాభం, గీతాంజలి, రాజ్‌బాబు, రమాప్రభ, నాగయ్య, ప్రభాకరరెడ్డి. యితర ముఖ్య తారాగణం. రాజశ్రీ, కాంతారావు అతిథి నటులు. రచన : జూనియర్ సముద్రాల, సంగీతం: ఘంటసాల, కెమెరా: సి. నాగేశ్వరరావు' కూర్పు: మార్తాండ్, కథ: రాజేంద్రకుమార్, దర్శకుడు: కె. యస్. ప్రకాశరావు, నిర్మాత: డి. రామానాయుడు. విజయా పిక్చర్స్‌వారి ద్వారా యీ చిత్రం ఆంధ్రలో ఆగస్టులో విడుదల అవుతుంది.

* * *

ఆగస్టులో శ్రీ డి. రామానాయుడు సురేష్ ప్రొడక్షన్స్ పేరిట 'పాపకోసం' అనే చిత్రాన్ని ప్రారంభించాలనుకుంటున్నారు. ప్రస్తుతం వారి కార్యాలయంలో సంగీత కార్యక్రమాలు సాగుతున్నవి. రచయిత : ఆత్రేయ, సంగీతం: పెండ్యాల నాగేశ్వరరావు. 'స్త్రీ జన్మ' పూర్తికాగానే యీ చిత్రనిర్మాణ కార్యకలాపాలు చురుకుగా ఆరంభమవుతాయని శ్రీ రామానాయుడు చెప్పారు, దర్శకుడు: కె. యస్. ప్రకాశరావు.

* * *

'నా చూపులె బిగి, నా రూపమే జిగి' ఆరుద్ర వ్రాసిన యీ పాటను ఎం. ఎస్. ప్రకాష్ సంగీత దర్శకత్వంలో భాగ్యలక్ష్మి ఫిలిమ్స్‌వారి 'భలే మాంత్రికుడు' చిత్రానికిగాను జానకి, మరి ఆరుగురు అమ్మా

# చిత్రలహరి

యిలు పాడారు. ఈపాట యిటీవల గోల్డెన్ స్టూడియోలో నాగలోకం సెట్టువేసి నాగకన్య (గీతాంజలి) మీద చిత్రీకరణ జరి పారు. భారీయెత్తున నిర్మించబడుతున్న యీ 'భేతాళ మాంత్రికుడు' చిత్రంలో యస్. వి. రంగారావు, గుమ్మడి, కాంతా రావు, రాజశ్రీ, గీతాంజలి, రేలంగి, గిరిజ ముఖ్యభూమికల్ని పోషిస్తున్నారు. రచన: సదాశివబ్రహ్మం, కెమేరా: రెహమాన్, కళ: ఘోడ్‌గాంకర్, సోమనాథ్, కూర్పు: నారా



"నిండుమనసులు"లో వాణిశ్రీ

యణ, దర్శకుడు: వేదాంతం రాఘవయ్య, నిర్మాత: డా. మెంత్రెడ్డి రామచంద్రరావు. ఆంధ్రలో యీ చిత్రానికి శక్తిఫిలిమ్స్‌వారు పంపిణీదారులు.

* * *

కౌముదీ ఫిలిమ్స్‌వారు 'పణమ్ పడైత్త వన్' తమిళచిత్రాన్ని 'కాలచక్రం' పేరుతో తెలుగులోకి అనువదిస్తున్నారు, ఎం.జి. ఆర్, జానకి, కె. ఆర్. విజయా, గీతాంజలి, నాగేష్ ముఖ్యగువారు నటించిన యీచిత్రా నికి అనిసెట్టి మాటలు, పాటలు రాశారు. సంగీతం: ఎం. ఎస్. విశ్వనాథం, కెమేరా: రెహమాన్, కూర్పు: బి. గోపాలరావు, దర్శకుడు: రామన్న, నిర్మాత: ఎం. ఎస్. రెడ్డి.

—మోహన్‌కుమార్

# పుస్తకాలు

## సరస్వతీ సాక్షాత్కారము

రచన: శ్రీ అనుమల కృష్ణమూర్తి. క్రౌను 11+3+66. అమూల్యం: దాతలకు ఉచితం. ప్రకాశకులు: యువభారతి, 5. కింగ్స్‌వే, సికింద్రాబాదు.

గేయరూపంగానూ, వచనరూపంగానూ నడిచిన పద్యాలతోనూ, గేయాలతోనూ, జాతీయాలతోనూ, గ్రాంథిక, వ్యావహారిక భాషలు రెండిటితోనూ ఈ ఖండకావ్యం కూర్చబడింది. ఇతివృత్తం స్వల్పం: "ఒక అర్ధరాత్రి అకస్మాత్తుగా మనశ్చక్షువుకు గోచరించిన చీరంచు స్త్రీ యొక్కాకృతిగ రూపొంది, కన్నుల నుండి కాళ్లవరకు కరుణామయియైన వాగ్దేవతాకృతిగ భాసించినది. అది సర్వరసాత్మికయై మహాంధ్ర జనని యైనది."

"కవికి వాగీశ్వరి ప్రాణేశ్వరిగా, ప్రభుప్రతీకగా, మాతగా, జీవనజ్యోతిగా అనేక చిదంశలతో భాసించింది." వెనుక పిల్లలమర్రి పినవీరన్న "వాణి నారాణి" అని చెప్పినాడు. ఈ కవికి ఆమె అనేక రూపాలలో భాసించింది.

"ఓ. చక్కని రసపుష్టి కలిగిన కావ్యాన్ని..... అందించాలని మేము చేసిన తొలి ప్రయత్నమిది...... అడిగిన వెంటనే శ్రీ అనుముల కృష్ణమూర్తిగారు పుస్తక ప్రచురణకు ఆమోదించడం మా అదృష్టం! కాదనకుండా ఉపోద్ఘాతము వ్రాసి యిచ్చారు డా. సి. నారాయణరెడ్డిగారు. అది మా భాగ్యం" అంటున్నారు ప్రకాశకులు నివేదికలో. నిజమే! శ్రీ నారాయణ రెడ్డిగారి 'ఆముఖం' కొత్త పద్ధతిలో ఇంపుగా సాగి రచనలోని వైశిష్ట్యాన్ని చక్కగా వివరిస్తూ, మంచి పద్యాలను ఉదాహరించింది. తొలుత దీనిని చదివితే రచయిత యెడల మంచి అభిప్రాయం కలుగుతుంది.

కాని— పుస్తకం పూర్తిగా చదివితే శ్రీ రెడ్డిగారు మంచి పద్యాలను మాత్రం ఏరుకుని ఉదాహరించినట్లు తెలుస్తున్నది. స్తనాలకు గిరులపోల్కయూ, పూరువులకు కదళీకాండాల పోలికా మున్నగు ప్రాచీన పద్ధతులు ఇందులోనూ ఉన్నవి. చక్కని మాండలికాలు రచయిత వాడినట్లు ఆ ముఖంలో ఉన్నది. యావదాంధ్రానికీ ఉద్దేశించిన రచనలో, తెలంగాణంలో మాత్రం వాడుకలో ఉన్న "మనాది" మొదలైన పదాల ప్రయోగం ఎక్కువ ప్రయోజనకారి కాదేమో! 'ఆత్మరాణి, నిలవెట్టి, కేల్పూస, జోపాట (జోలపాట), నమ్మకస్తులు, కష్టగాళ్ళ ప్రశస్త ప్రయోగాలుగా కానరావు. 'రాకేందు సహస్రచందనముఖీ! రసార్ణవపూర్ణసుధాకరేందిరా! దేవద్రాక్షా రసోర్మి ప్రభా!' అనే పిలుపుల అభిప్రాయం ఏమో తెలియకున్నది. "తన కుసుమ్మస్తన చుంచువు, ముని ప్రవేశను నలుపు శిశువు మోమున..." ఇక్కడ చుంచువు అంటే చూచుకమని అభిప్రాయమా? కొన్నిచోట్ల కవి హృదయం వ్యక్తం కాలేదు.

పుస్తకం చక్కగా ముద్రించబడినా, అచ్చు తప్పులు మాత్రం ఎక్కువే! చాలావరకూ సిరాతో దిద్దుకొనవలసి వచ్చింది. దిద్దని తప్పులున్నూ ఎన్నో ఉండిపోయాయి. లక్షణాన్ని అనుసరించిన చోట్లలో— లక్షణాలకు విరుద్ధంగా కూడా కానవస్తున్నవి. ప్రూఫుల విషయంలో తగినంత శ్రద్ధ తీసుకున్నట్లు కానరాదు. "ఇందులో ప్రోత్కర్ష" లేదని రచయిత చెప్పుతూ "కవిత్వపుం జౌరవమాతగ వ్రాతు మహాకవిత్వమున్" అని వ్రాయడం సముచితంగా లేదు.

ఈ పుస్తకం అమూల్యమనీ, దాతలకు మాత్రం ఉచితమనీ ప్రకటనలో ఉన్నది. దాతలు కానివారికి ఈ పుస్తకం లభించే మార్గం లేనట్లు ఈ ప్రకటన వల్ల తెలుస్తుంది. అందరికీ అందుబాటులో వుండే రీతిని వెలను నిర్ణయిస్తే మేలేమో!

—ఆంగీరస

## మజిలీ

(నవల. రచయిత: శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం. ప్రచురణ: విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ—2. వెల: సాదా, రూ. 3—50. మేలు, రూ. 4—50)

ప్రయివేటు కాలేజీలలో అందులోనూ, సహవిద్య వున్న వాటిలో విద్య అసామాన్యంగా వుంటుంది. కొన్ని 'కళ్యాణ మంటపాలు' కావటం అనేది పూర్తి అసత్యం అనటానికి వీలు తక్కువ.

మూడు నెలల క్రితం ఎం. ఏ. విద్యార్థి తదనంతరం లెక్చరరు అయి, విద్యార్థీ విద్యార్థినులను చూచి, తన ఉనికి గ్రహించే సరికి పట్టేకాలంలో ఇట్టే కొన్ని కొన్ని అవక తవకలు జరిగిపోతాయి. అది చిత్రించే నవల 'మజిలీ'. ఆ దశ దాటడమే ఈ 'మజిలీ.'

శ్యామసుందర్ వంటి అధ్యాపకులను ఆదరంగా పలకరిస్తూ ప్రకాశకులు పలికిన పలుకుల్లో సానుభూతి నవ్యంగా వుంది. శ్యామసుందర్‌లో ఎక్కడ లేని గొప్పతనం చూపించిన రచయిత, ఒక విద్యార్థి ఆధారంగా చక్రపాణి పాత్ర సృష్టించాననటంతో 'శ్యామసుందర్ ఆత్మ వెనుక రచయిత ఆత్మ వుందని పిస్తుంది.

'శ్యామసుందర్' యువకుడు. తెలుగు లెక్చరరు. పెళ్లి కాలేదు. పెళ్ళి వినా జీవితం పరిశోధిస్తున్నాడు. పరిశోధన ఫలితం శారద. ఎటువంటి సమ్మెలు అయినా ఆపు చేయించ గలడు. గొప్పగా పాఠం చెబుతాడు. ప్రిన్సిపాల్‌తో సత్సంబంధాలు ఉన్నాయి. శ్యామసుందర్ 'డిఫేక్టొ' ప్రిన్సిపాల్. శారదను ప్రేమించాడో లేదో తెలియదు. అదే అవ్యవస్థ. కథలు రాసేడు, ఆమె ఫెయిర్ చేసింది. పత్రికలలో ప్రచురణ! నవల— ఫెయిర్— బహుమతి— శారదకు అంకితం. పరిస్థితి చెడింది. శారద దూరమయింది. ఉద్యోగము పోయింది. నవల సినిమా తీయబోతున్నారు. పత్రికలో ఉపసంపాదకుడుగా ఉద్యోగం. మద్రాసు ప్రయాణం అదే మజిలీ! మళ్ళీ కథలేదు.

విజయవాడ వంటి పట్టణంలో రెండో వారం కూడా ఆడని తెలుగు సాంఘిక సినిమాలో హీరో లాగా వుంటాడు శ్యామసుందర్. అన్ని మంచి గుణాలు అతనికే వున్నాయి. అంత అసహజంగానూ వుందా పాత్ర!

శారద పాత్ర అలా లేదు. చాలావరకు సహజంగా వుంది. ఆమె శ్యామసుందర్‌కు అర్థం కాలేదు, డిటో రచయిత. డిటో పాఠకులు. అందుకే ఆసక్తి! ఆమె అత్త దగ్గర పెరిగింది. విద్యార్థినిగా శ్యామసుందర్‌తో పరిచయం అయింది. బావ పరిచర్య— బాధ్యత— వదులుకోలేక, శ్యామసుందర్‌తో సవ్యంగా ప్రవర్తించలేక చికాకుపడి చికాకు కలిగించిన పాత్ర శారద. సహజత రేఖామాత్రంగా కనిపించేది శారద మనస్తత్వంలోనే!

జగన్ పాత్ర పట్ల సానుభూతి కలుగుతుంది.

కథావథకం లోప భూయిష్ఠం. రచన బాల్యావస్థకు ప్రతిబింబం!

జగన్ పట్ల శారద పెంచుకొన్న అనుబంధానికి విధి వంచిత బాధ్యతకు పూర్వరంగం, స్థాపన పటిష్ఠం కావు.

ప్రయివేటు కాలేజీలలో కమిటీ మెంబర్ల వల్ల అధ్యాపకులు, ప్రిన్సిపాల్ పొందే కష్టాలు వాస్తవంగా వున్నాయి.

విద్యార్థులలో క్రమశిక్షణా రాహిత్యానికి ప్రత్యక్షంగా నవలలో కారణాలు లేవు. పరోక్ష కారణాలు సమగ్రంగా లేవు. ఎందరు విద్యార్థులో అన్ని రకాల కారణాలు! క్రమశిక్షణ లేని కాలేజీలన్నీ చూపెట్టే ప్రయత్నంలో రచయిత కార్యసిద్ధి పొందినట్టే!

ఈ రచనలో కొందరు అధ్యాపకులు గ్రాంథికంలో మాట్లాడుకొంటారు. అందులో తప్పుల తడకలు! ఆవిధమయిన సంభాషణ రచనలో ఔన్నత్యం సంపాదించలేదు.

నవల ముగింపు బాగుంది.

ఎన్నో పుస్తకాలు ముద్రణ భాగ్యం పొందుతున్నాయి. ఈ నవల పొందటంలో వింత లేదు. కాని విశాలాంధ్ర ప్రచురణాలయం మీద అభిమానం వున్నవాళ్ళు, ఈ నవల చదివింతర్వాత ఇటువంటి రచనలు కూడా ముద్రిస్తున్నారా అని ఆశ్చర్యపోతారు.

పాఠకులు, ఇది అభ్యాస ప్రాయ రచన అనీ, రచయిత, శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం ముందు ముందు మంచి రచనలు చేయవచ్చుననీ, ఆశిస్తారు.

—మనోరాణి

## మెదడుకి మేత

(29వ పేజీ తరువాయి)

కలుసు కుంటాయి. రెండవ త్రిభుజములో కోణములను సమద్విఖండన చేసే రేఖలు గీయబడ్డాయి. ఇవి మూడూ కూడా ఒక బిందువులో కలుసుకుంటాయి. సమ బాహు త్రిభుజములకైతే ఈ రెండు బిందువులూ కలుసుకుని ఒకే బిందువు అవుతుంది.

* * *

(చ) 10, 11, 12, 8, 4, 3, 7, 6, 2, 1, 5, 9 — ఈ క్రమంలో కిటికీలను దర్శించి వచ్చింది కోతి. ఈ పద్ధతిలో అడుగువరుసకూ, నడిమి వరుసకూ మధ్యనున్న పెద్ద ఎడం రెండేరెండుసార్లు దాటినట్లు అవుతుంది.

* * *

(ట) మొత్తం 15 సెనెటీగలు.

* * *

(త) $326 + \frac{326}{10} + \frac{326}{10} + \frac{326}{10^2} + \frac{326}{10^2} + \frac{326}{10^3} + \frac{326}{10^3} + \ldots$

$= 326 + 2 \times 326 \left[ \frac{1}{10} + \frac{1}{10^2} + \frac{1}{10^3} + \ldots \right]$

$= 326 + 2 \times 326 \times \frac{1}{9}$

$= 398\frac{4}{9}$ అడుగులు.



## పుస్తకాలు

**ఎవరు దోషి?**

నాటకం. 'సువర్ణశ్రీ' అనబడే బల్లోజు బసవలింగం గారి రచన. మహోజ్వల సాంఘిక నాటకం. రంగాలు రెండే అయినా నిండైన నాటకం. ప్రదర్శనార్హమైనదీ చూడతగ్గదీ అయిన ఈనాటకంలో ఏడు పురుష పాత్రలూ ఒకస్త్రీ పాత్ర ఉంది. 92 పేజీల పుస్తకం వెల రెండు రూపాయిలు. వి.జి.యస్. పబ్లిషర్సు, అమలాపురం.

**సుధ**

సుధ సుచిత్ర మాసపత్రిక మే తొలిసంచిక మాకార్యాలయం చేరింది. ప్రముఖ చిత్రకారుడు బాపూ అలంకరణతో టి. చంద్రశేఖర్ సంపాదకత్వంలోను విశాఖ పట్టణం నుంచి వెలువడుతున్నది. విడవకుండా చదవాల్సిన రచనలు అందమైన తొలిసంచికలో ఉన్నాయి. 120 పేజీలు, ¼ డెమ్మీసైజు. విడి ప్రతివెల 80 పైసలు. చిరునామా: సుధ సుచిత్ర మాస పత్రిక, బీచ్ రోడ్డు విశాఖ పట్టణం—1.

**కుమార విజయము**

కావ్యము. కుమార సంభవ కావ్యాన్నిచక్కని తేట తెనుగు పద్యాల్లో రచించారు. విద్వత్కవులు విద్వాన్ శ్రీ మన్నవ వేంకటరాధాకృష్ణ శర్మ. ఇందులో ఆరు స్కంధాలున్నాయి. 98 పేజీలు, 527 పద్యాలు, పుస్తకం వెల రు. 50 పైసలు. ప్రతులకు :బృందావన్ పబ్లిషింగ్ హవుస్, మారిస్‌పేట, తెనాలి.

—సికరాజు.




**Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.**